Photo by C. P. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

పూలరంగడు

పంపినవారు :
ఆర్. ఎస్. జాన్ - విజయనగరం

వస్తున్నది

వాహినీ చిత్రము





# పెద్ద మనుష్యులు

నిర్మాత-దర్శకుడు కే.వి.రెడ్డి B.Sc.Hons.

నిత్య జీవిత సత్యాల నిరూపించే నిరుపమాన సాంఘిక చిత్రము



## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



## చందాదారులకు మనవి

★

పైనెల చందమామ యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోస్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, పై నెల పదోతేదీలోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడువచ్చు కంప్లెంట్లు. గత నెలలో చేరలేదనే కంప్లెంట్లు గమనించబడవు.

మేనేజరు

నవ వికసిత పుష్పం వలె

తాజాగా, మనోహరంగా ఉండండి...

హమాం క్రొత్త సువాసన
కలది...మరియు ఎక్కువ
కాలం మన్నునుకూడా!

# హమాం

## టాయిలెట్ సబ్బును వాడుడు

ది తాతా ఆయిల్ మిల్స్
కంపెనీ లిమిటెడ్




తాతా తయారు

మెంబర్, ఇండియన్ సోప్ & టాయిలెట్రీస్ మేకర్స్ అసోసియేషన్

# చందమామ

ఇంతటితో మన చందమామకు ఆరేళ్ల ఆరు
నెలల వయస్సు నిండుతున్నది. ఈ గడువులో
చందమామ ఆడిన ఆటలూ, పాడిన పాటలూ
ఎటువంటివో వచ్చేనెల తెలుసుకుందురుగాని.
ఈ సంచికలో 'శబ్దవేధి' సీరియల్ ముగిసింది.
ఆతరువాత వచ్చే కథ 'తోకచుక్క'. ఇందులోని
కొందరి స్వరూపాలూ, కొన్ని సంఘటనలూ 25-వ
పేజీలో చూడవచ్చు. కిందటిసారి వేసిన 'పొట్టిపిల్ల'
అనే కథ మూడురంగుల బొమ్మలతో తయారైంది
కద! ఇదిచూచి చాలామంది అటువంటి 'త్రివర్ణ
చిత్రాలు' వేయమని కోరుతూ ఉత్తరాలు వ్రాశారు.
అందుచేత, అవకాశాన్నిబట్టి వచ్చే సీరియల్ కథ
మూడురంగులలో ముద్రించటానికి ప్రయత్నిస్తాము.

సంపుటి 13 : డిసెంబర్ 1953 : సంచిక 6

ంచాలకుడు:
'చక్రపాణి'




# అసలు పాట

కళ్ళద్దాలను సమకూర్చుటలో
తెలివిమంతుడని పేరు గణించుచు
చాలకాలముగ నుండే వా డొక
ఊళ్ళో ఒక ఘన ప్రజ్ఞావంతుడు.

"చదువుట కష్టం అయితే సుళువుగ
చదివే సదుపాయం చేస్తా"నని
పెద్దగ వ్రాసిన బల్ల కట్టుకొని
పెద్దషాపునే పెట్టె నతండు.

వీధిని పోతూ వెంగలి యొక, డా
వీధిని పోయే ఎవనివల్లనే
బల్లమీది అ వ్రాత తెలుసుకుని
చల్లగ తానా షాపును జేరి—

"చదివే సదుపాయం చూస్తుర ?"అని
బెదురుచు నడుగగ నా యజమాని
"మన పని అదియే, రండీ మిమ్మొక
క్షణములోనె చదివిస్తా గను"డని

లేత అద్దముల జోడు నమర్చి
చేతికి చక్కని పుస్తక మిచ్చి
"ఏమైనా ఇవి అనుచున్నవా:
ఏమీ సుళువుగ చదువజాలరా!



(గేయకథ)

ఐతే ఇవి చూడం"డని కొంచెం
ముతకద్దాలిడి "యెట్లున్న ?" దన
"ఎప్పటివలెనే ఉన్నది స్థితి "యని
చప్పరించి ఆ వెంగలి యనెను.

"ఐతే యిక మీ చత్వారానికి
భూతద్దం యిది దుర్భిణితో సమ"
మంటూ అతడొక జత తగిల్చి "యే
మంటారిప్పుడు చెప్పండీ" యన

"వెనుకటికంటే అఘోమయంగా
ఉన్నది! మీ సదుపాయ మిదా?" యనె.
తనవద్దను గల అద్దాలేవీ
ఆనకపోవుట కాశ్చర్యపడి

నిదానముగ గని, అతడొక గ్రుడ్డియు
కాదని తెలిసి, ఆ యజమాని
"ఐతే అయ్యా! అసలు మాట చదు
వయినా వచ్చా తమ ?" కని అడుగగ

"ఐతే నాకా చదువే వస్తే
మీ యార్భాటం దేనికి దండగ ?
మిము పోలీసుకి పట్టిస్తా"నని
ధుమధుమ వెంగలి లేచిపోయెను.






# అట్టమీది బొమ్మ

మత్స్యయంత్రం భేదించిన సవ్యసాచి మెడలో ద్రౌపది పూలమాల వేసిందని చెప్పాముకద! ఐతే, పెద్దల ఆదేశంప్రకారం ఆమె పంచపాండవు లైదుగురనూ పెళ్ళాడవలసి వచ్చింది. పెండ్లి కాగానే, పాండవులు రాజధాని ఐన ఇంద్ర ప్రస్థపురానికి వెళ్ళిపోయారు.

ఒకరోజున నారదమహర్షి వచ్చి వారికి అనేకమైన హితబోధలు చేస్తూ, సుందోపసుందుల కథకూడా చెప్పాడు.

సుందోపసుందులు 'నికుంభుడు' అనే రాక్షసుని కుమారులు. వారు సామాన్యులు కారు. ఇద్దరూ మంచి తపశ్శాలులు. ఒకరికొకరు గాఢ మైత్రితో ఉండేవాు. ఈ మైత్రి ఎప్పుడూ ఇలానే ఉంటుందని వారి నమ్మకం. ఈ నమ్మకంతో ఒకప్పుడు బ్రహ్మనుగూర్చి వారు ఘోర తపస్సు చేశారు.

బ్రహ్మ ప్రత్యక్షంకాగా, వారు "దేవా!—పరస్పరమూ మాకు మేము తక్క, ఇతరులెవ్వరివలనా మాకు చావులేకుండా వరం అనుగ్రహించవలిసింది" అని కోరుకొన్నారు. 'సరే' అనిచెప్ప బ్రహ్మ తనలోకానికి వెళ్ళిపోయాడు.

వరబలంవలన వాళ్ళు గర్విష్ఠులై, దేవలోకంమీదికే దండెత్తారు. భూలోకమందు సాధులను హింసింపసాగారు. ప్రజ వాళ్ల బాధ భరించలేక తిన్నగా పోయి బ్రహ్మతో మొరపెట్టుకొన్నారు.

అప్పుడు బ్రహ్మ విశ్వకర్మనిచేత ఒక చక్కటి స్త్రీరూపాన్ని తయారు చేయించాడు. బ్రహ్మ ఆమెను పిలిచి, "ఓ తిలోత్తమా! నీవు భూలోకానికి పోయి, గర్విష్ఠులైన సుందోపసుందులను పరిమార్చిరావాలి" అన్నాడు.

సమయంచూచి ఆమె భూలోకానికి దిగివెళ్ళి, వారిని ఎంతగానో ఆకర్షించింది. ఆమెను చూచి వారిద్దరూ 'నేను పెళ్లాడతా'నంటే 'నే పెళ్లాడతా' నని పోటీలుపడి తగవులాడారు.

తగవు తెగలేదు. వారిలోవారికి ఆమెనుగురించి మత్సరం ఎక్కువైంది. చివరకు యుద్ధానికి తలపడి, ఇద్దరూ యుద్ధంలో చచ్చి, కింద పడ్డారు.

తిలోత్తమ మళ్ళీ దేవలోకానికి వెళ్ళిపోయింది. ఆ దుర్మార్గుల పీడ వదలినందుకు సమస్తలోకాలూ సంతోషించినై.




పూర్వకాలమందు 'బెతెల్హామ్' అనే గ్రామానికి సమీపంలో గొల్లపిల్లవాళ్లు కొందరు గొఱ్ఱెలను కాస్తూవున్నారు. వాళ్ళకు ఒక నాటి రాత్రి ఆకాశంలో ఒకమూల గొప్ప చుక్క ఒకటి కానవచ్చింది. ఇది ఏమిటా అని వాళ్ళు భయమూ ఆశ్చర్యమూ పొందుతూవుండగా, ఒక దేవదూత దిగి వచ్చి వాళ్లయెదుట నిలబడ్డాడు.

"అబ్బాయిలూ!—భయపడకండి. మసందరకూ దేవదేవుడైన ఏసుక్రీస్తు ఇప్పుడు జన్మించివున్నాడు. ఇందుకోసమే ఆ గొప్ప నక్షత్రం అలా మెరుస్తున్నది," అనిచెప్పి అదృశ్యమయ్యాడు. దేవదూత మాటలకు ఉప్పొంగిన గొల్లపిల్లవాళ్లు ఆ చుక్క మెరిసే దిక్కుకు పోసాగారు.

ఆ చుక్క చాలామందికి కనిపించింది. ఆ చూచినవారిలో ముగ్గురు మహాజ్ఞానులు కూడా వున్నారు. ప్రపంచాన్ని ఉద్ధరించగల మహాపురుషుడు ఏసుక్రీస్తు పుట్టాడని, వారు పోయి తమ ప్రభువైన 'హీరాడ్'తో విన్నవించారు.

'అయితే, క్రీస్తు ఎక్కడ వున్నాడో చూచి రండి. వచ్చి నాకు చెప్పండి. నేనూ పోయి దర్శనం చేసుకొంటాను' అన్నాడు హీరాడ్. వెంటనే రాజాజ్ఞప్రకారం జ్ఞానులు ముగ్గురూ లొట్టిపిట్టలమీద బయలుదేరి క్రీస్తును చూడబోయారు.

ప్రభువైన హీరాడ్ జ్ఞానులతో అలా అన్నాడేకాని, నిజానికి అతనికి క్రీస్తుపైన భక్తి లేదు. అతను బహుక్రూరుడు. కఠినాత్ముడు. క్రీస్తు పుట్టిన ఉనికి తెలిస్తే, అక్కడకు తను స్వయంగా పోయి, పసి వానిని పరిమార్చవలెనని రాజు దురుద్దేశం.

గొల్లపిల్లవాళ్ళను సాయం తీసుకొని జ్ఞానులు ముగ్గురూ ఆ గొప్పచుక్క మెరిసే దిశకు వెళ్ళారు. కొన్నాళ్ళు ప్రయాణం .

డి. పాండురంగ విఠల్




చేశాక, వారొక సత్రం చేరుకున్నారు. క్రీస్తు తల్లి మేరీ, తండ్రి జోసెఫూ ముందుగా ఈ సత్రంలోనే బసచేదామనుకున్నారు. కాని, అక్కడ జనసమూహం ఎక్కువగా ఉన్నందున ఒక పశువులశాలలో బస చేశారు. ఇక్కడనే క్రీస్తు జన్మించాడు.

శిశువుగా ఉన్న క్రీస్తును చూడగానే జ్ఞానులు ముగ్గురూ, తన్మయులయ్యారు. ఆ మహానుభావునికి సాష్టాంగదండాలు పెట్టారు. అయితే, వాగ్దానంప్రకారం జ్ఞానులు రాజు వద్దకు పోయి తాము క్రీస్తును చూచివచ్చిన సంగతి చెప్పనేలేదు. చెబితే, అతను శిశువును సంహరిస్తాడని వారికి తెలుసు.



అక్కడ హీరాడ్—ఈ జ్ఞానులకోసం చూచి చూచి, వీరు ఎంతకూ తిరిగి రాక పోయేసరికి 'ఓహో, మోసం జరిగిందే!' అని తలచి, ఉగ్రుడయ్యాడు. తక్షణమే తన సైనికులను పిలిచి, "మీరు నించున్న పాటున మన పటాలాలను నలుమూలలా పంపించి, రాజ్యంలో కంటబడిన ప్రతి శిశువునూ చంపించివేయవలసింది" అని ఆజ్ఞాపించాడు. ఇలా పుట్టిన శిశువులందరనూ చంపివేస్తే, అందులో క్రీస్తుకూడా వుంటాడు కదా, వాడు చస్తే తనకు పీడ విరగడవుతుందని రాజు వుద్దేశం.

ఇక్కడ రాజు ఇలా కంగారుపడుతూ వుండగా, అక్కడ క్రీస్తు పుట్టినచోట ఒక చిత్రం జరిగింది. జోసెఫ్‌కు దేవుడు రాత్రి కలలో కనిపించి, 'మీకు పుట్టిన బిడ్డడు క్రీస్తు లోకోద్ధారకుడు సుమా. మాతా శిశువులను ఇద్దరినీ వెంటనే స్థలం తప్పించి, మరిఒక చోటికి తీసుకపోవలసింది' అని హెచ్చరిక చేశాడు. అందుచేత జోసెఫ్, క్షణమైనా జాగుచేయక, మేరియమ్మనూ బిడ్డనూ ఒక గాడిదమీద ఎక్కించుకొని, ఈజిప్టుదేశం చేరుకొన్నాడు. హీరాడ్‌రాజు చచ్చిపోయిన వార్త తెలిసేటంతవరకూ వారు అక్కడనే గుట్టుగా కాలక్షేపంచేశారు.






ఇక ఫరవాలేదు, బిడ్డకు గండం తప్పిందీ అని ధీమా కలగగానే, జోసెఫ్ తన కుటుంబాన్ని 'నజరత్' అనే తావుకు తీసుక పోయాడు. క్రీస్తు ఇక్కడనే పెరిగి పెద్దవాడయ్యాడు. క్రీస్తు తక్కిన పిల్లలతోపాటు ఆడుతూ, పాడుతూ, బడిలో చదువుకొంటూ, తన తండ్రి చేసే వడ్రంగిపనిలో తోడు పడుతూ ఉండేవాడు.

చూపులకు క్రీస్తు తక్కిన అందరివంటి పిల్లవాడే. కాని, బుద్ధికి బృహస్పతి. ఎటువంటి పండితులు వచ్చి ఎంతటి కఠిన ప్రశ్నలు వేసినా, వాటన్నిటికీ యుక్తి యుక్తంగా సమాధానాలు చెప్పగలుగుతూ ఉండేవాడు.

ఒకరోజున క్రీస్తును తీసుకొని, తలిదండ్రులు యాత్రకు వెళ్ళారు. కాని, ఇంటికి తిరిగి వచ్చేటప్పుడు బిడ్డడు కనిపించకుండా తప్పిపోయాడు. మూడు రోజులపాటు తలిదండ్రులు మతిపోయి,పసివాడికోసం అహోరాత్రాలు తెగ వెతికారు.

కాని, అప్పటికే క్రీస్తు దేశసంచారం ప్రారంభించాడు. ఆయన బోధించిన ప్రేమ సూత్రం అందరకూ ఆప్యాయమయింది. అందుచేత, క్రీస్తు బోధలను ప్రజలు ఎంతో భక్తితో అనుసరింపసాగారు.

ఆ మహానుభావుడు తన సంచారంలో ఎంతోమంది గ్రుడ్డివారికి దృష్టి ప్రసాదించాడు. సొట్టవాళ్ళను బాగుచేశాడు. మరి ఎన్నో లోకోపకారములైన మహిమలు చూపించాడు.

ఏసుప్రభువు చేసే మహోపదేశాలు చేపలుపట్టే బెస్తవాళ్ళకూ, వర్తకంచేసుకొని జీవయాత్రలో తాపత్రయపడేవాళ్లకూ, అందరకూ ఇష్టమైనాయి. ఎక్కడపడితే అక్కడ జనం గుంపులుగా చేరి క్రీస్తుబోధలు వినేవారు. చాలామంది వాళ్ళ వృత్తులు మాని క్రీస్తుకు శిష్యులయ్యారు. ఇలా అతనికి బలం చేకూరటం ఏలిక అసూయకు కారణమైంది.



17



ఏ కాలమందూ దుష్టులు ఉంటూనే వుంటారు. క్రీస్తుప్రభువు చేసే ఉపదేశాలు కొంతమంది దుర్మార్గులకు నచ్చలేదు. రాజూ, పరివారమూ ఆయనకు ఎదురుతిరిగి, క్రైస్తవ మతానికి విరుద్ధంగా దుష్ప్రచారం చేశారు. చివరకు ఆ మూర్ఖులు దయమాలి క్రీస్తుపై నెపంపెట్టి, శిలువవేసి చంపటానికి కూడా సాహసించారు!

శిలువ వేయటమనగా క్రీస్తును నిలబెట్టి చేతులు రెండూ చాచి, మేకులతో బిగించి, హింసించటం. ఇంతచేసినా, ఆ క్రూరుల మీదకూడా క్రీస్తుప్రభువుకు కోపంరాలేదు. వారికీ ప్రేమసందేశాన్నే అందించాడు.

క్రీస్తును శిలువవేసిన మూడవరోజున ఆయన తన శిష్యకోటి అందరకూ సజీవంగా దర్శనమిచ్చి, ఊరడించాడు. బద్ధ శత్రువుమీదనైనా సరే పగ పూనటం పనికి రాదని ఆయన శిష్యులకు ధర్మబోధచేసి అంతర్థానమయ్యాడు.

ఈవిధంగా క్రీస్తుప్రభువు శిలువవేయ బడటానికి ఒక కారణమున్నది. పూర్వం దేవుడు ఏసుకు అన్నిమహిమలూ ఇచ్చాడు కాని, ప్రాణం పోయటానికిమాత్రం అధి కారం ఇవ్వలేదట. ఐతే, దయామయుడైన క్రీస్తు, దేవుని మాటను జవదాటి ఒక జీవుడికి ప్రాణం పోశాడు. అందువల్లనే ఆయనకు ఈ శిక్ష ప్రాప్తించిందని చెబుతారు.

క్రీస్తు బోధించిన మతమే క్రైస్తవ మతం. ఈ మతం ప్రపంచమంతటా విరి విగా అల్లుకొని వున్నది. మహానుభావుడైన క్రీస్తు మతప్రవక్తమాత్రమే కాదు, శకపురు షుడుకూడా. ఇప్పటికీ ఇంచుమించు ఆయన పేరిట ప్రపంచమంతటా క్రీస్తుశకమే అమలులో వుంటున్నది.

క్రీస్తును శిలువ వేసిన ఆ స్వరూపమే క్రైస్తవమతానికి చిహ్నంగా ఏర్పడింది. ఏటా డిశంబరునెలలో జరిగే క్రిస్మస్ పండ గలు క్రీస్తునుగురించినవే.



# శబ్దవేధి

[విజయవర్మ, బీసల్పూరు ప్రభువు ప్రశ్నకు వెంటనే ప్రత్యుత్తరం యివ్వక తటపటా యించాడు. అయేసరికి, మళ్ళీ ఆయన అదే ప్రశ్న అడిగాడు. అందుకు బదులుగా—]

" నాపేరు విజయవర్మ !" అని మాత్రం చెప్పగలిగాడు విజయుడు.

" మిమ్మల్ని గురించి నేను తెలుసుకో వలసింది ఇంతేనా ?" అని ప్రశ్నించాడు బీసల్పూరు ప్రభువు. తరువాత తల పంకిస్తూ యిలా అన్నాడు:

" మీరు ఏ పక్షంవాళ్ళు ? బీసల్పూరా— కోసల్పూరా ?"

" నేను బీసల్పూరు పక్షంవాణ్ణే !" అన్నాడు విజయవర్మ గంభీరస్వరంతో.

" ఈ మాటకు రుజువేమైనా వుందా ?" అని అడిగాడు బీసల్పూరుప్రభువు అనుమా నిస్తూ. కాని అంతలోకే చిరునవ్వు నవ్వుతూ " మిమ్మల్ని అనుమానించానని అనుకో వద్దు. ఈనాటి పరిస్థితులలో ఎవరు ఏనాటికి ఎలా మారిపోతారో చెప్పలేము !" అన్నాడు.

తనను అనుమానించేసరికి విజయ వర్మకు ఎక్కడలేని కోపం వచ్చింది.

" నేను చంద్రదుర్గాధిపతిని ఎరుగు దును. నా గురించి ఆయనకు బాగా తెలుసు " అన్నాడు విజయవర్మ.

చంద్రదుర్గాధిపతి పేరు చెవిని పడేసరికి, బీసల్పూరుప్రభువు ముఖం ప్రసన్నమైంది.

" సరే, ఇక నీగురించి నాకు అనుమానా లేమీ లేవు. ఈ వున్న సైన్యంతో దేవపూర్ జయించవచ్చునని నేను అభిప్రాయపడు





తున్నాను. నాకన్న నీవు ముందునుంచీ ఈ ప్రాంతంలో ఉన్నవాడివి కనక, నీ అభిప్రాయం అడుగుతున్నాను. దాపరికం లేకుండా మాటాడు" అన్నాడు బీసల్వారు-ప్రభువు.

క్షణకాలం ఆలోచించాడు విజయవర్మ.

"మన సైనికబలం ఎంతో తెలిస్తే నేను మీకు తగిన సలహా యివ్వగలను!" అన్నాడు.

"నా వెంట గుర్రపుదళం, కాల్బలం— అంతా కలిసి ఏడెనిమిది వందలమంది వుంటారు. సాయంకాలానికి దాదాపు వెయ్యి మంది సైనికులతో చంద్రదుర్గాధిపతి మనకు సాయం వస్తాడు!" అన్నాడు బీసల్వారు ప్రభువు.

"అలాంటిపక్షంలో మనం దేవపూర్‌ను పూర్తిగా జయించలేకపోయినా, శత్రువుల్ని దెబ్బతియ్యవచ్చు" అన్నాడు విజయవర్మ.

"అయితే మన వ్యూహం ఏమిటి?" అని అడిగాడు బీసల్వారు ప్రభువు.

"మనం ఎంత హఠాత్తుగా దేవపూర్ మీద దాడి చేయగలిగితే విజయం అంతగా మనకు సుకరమవుతుంది. దేవపూర్‌కూ, ఈ అడవికీ మధ్యవున్న మైలుపొడవు ఖాళీ ప్రదేశాన్ని శత్రువులు చూడకుండా మనం దాటితే, వాళ్లను నిరాయుధులుగానే మనం నుగ్గునుగ్గు చేయవచ్చు" అని చెప్పాడు విజయవర్మ.

"సరే, దాడికి ఏర్పాట్లు చేయించు. ఈ పరిసరాలు బాగా తెలిసినవాడివి కనక, ఈ కార్యభారం నీమీదనే వుంచుతున్నా" అంటూ బీసల్వారుప్రభువు గుడారంలోంచి లేచాడు.

విజయవర్మ ఆజ్ఞమేరకు, బీసల్వారు అశ్వికదళాలు ముందు కదిలినై. వెనక బారులు తీరి పదాతి సైనికులు నడవసాగారు. విజయవర్మా, బీసల్వారు ప్రభువూ రెండు ఉత్తమాశ్వాలను అధిరో





హించి సైన్యానికి ముందు బయలుదేరారు. కొద్దిసేపట్లో సైన్యమంతా దేవపూర్‌వైపు అడవి చివరకు చేరారు.

బీసల్వారు ప్రభువుతో విజయవర్మ సంప్రదించాడు. ముందు గుర్రపుదళం శర వేగంతో ఆ ఖాళీప్రదేశాన్ని దాటి, అక్కడికి చేరువలో వున్న దేవపూర్ పొలిమేరను ఆక్రమించాలి. వెనుకనే కాల్బలం వచ్చి చేరితే-తరవాత ముందుకు చొచ్చుకుపోవచ్చు.




బీసల్వారు ప్రభువు ఆజ్ఞాపించాడు. మొత్తం గుర్రపుదళం అడవినుంచి బయటకు వచ్చి శరవేగంతో దేవపూర్‌కేసి పరుగెత్తసాగింది. అదే సమయంలో దేవపూర్‌లో గుడిగంటలు మోగజొచ్చినై. హెచ్చరిస్తూ తప్పెటలూ బాకాలూ మోగినై.

"మనం రావటాన్ని శత్రువులు పసికట్టారు. అయినా ఫరవాలేదు. ముందు మనం ఆ కనబడే పొలిమేర ప్రాంతంలోని యిళ్ళను ఆక్రమించుకో గలిగితే, వాటిని రక్షణగా పెట్టుకుని శత్రువులను నిలువరించవచ్చు" అన్నాడు విజయవర్మ.

"మంచి ఆలోచన! మనం పట్టణాన్ని ఆక్రమించుకోలేకపోయినా, కనీసం కాలు పెట్టగలిగితే అంతే చాలు. సాయంకాలానికల్లా మనకు చంద్రదుర్గాధిపతి బలాలు సాయంగా వస్తాయి. అప్పుడు మొత్తం శత్రుసైన్యాలను మట్టుపెట్టవచ్చు!" అని జవాబిచ్చాడు బీసల్వారు ప్రభువు.

బీసల్వారు గుర్రపుదళం దేవపూర్ పొలిమేరలను సమీపించింది. మొత్తంమీద విజయవర్మ ఎత్తు కొంతవరకు విజయం సాధించినట్టే కనబడింది. హఠాత్తుగా వచ్చిన దాడిని ఎదురుకొనేటందుకు సర్వసన్నద్ధంగా లేని భీమవర్మ సైనికులు, నలుగురూ ఐదుగురేసి చొప్పున వచ్చి బీసల్వారు గుర్రపు రౌతులను ఎదుర్కోవటానికి ప్రయత్నంచేశారు. కాని అలాంటి సైనికులందరూ గుర్రపు రౌతుల చేతిలోని





యీటెలకు యిట్టే బలి అయిపోయారు. ఇక పట్టణంలోని ఇతర ప్రాంతాలలో బాకాల మోతా, సైనికుల కోలాహలమూ ఎక్కువయింది.

భీమవర్మ తన సైనికులందరినీ ఎదురు దాడికి సమీకరిస్తున్నట్టు ఆ సందడి తెలియ చెబుతూవుంది. నాలుగు బజార్లు కలిసే కూడలిస్థలాన్ని ఆక్రమించుకొని, విజయవర్మ సైనికులనూ గుర్రపు రౌతులనూ నాలుగుగా విభజించి నాలుగు బజారుల మొగదలా, చివరలా రక్షించుకుకో యత్నించాడు.

సైనికులు బజారువరసలలో వున్న ఇళ్ళ తలుపులు బద్దలుకొట్టి, యిళ్ళల్లో వున్న సామానంతా వీధిమొగలో దొంతరులలాగా పేర్చసాగారు. కుర్చీలూ, మంచాలూ, తలుపులూ! ఏవి దొరికితే అవి తెచ్చి వీధి మొగను పెద్ద ఎత్తున పేర్చారు. వాటివెనక ధనుర్బాణాలు ధరించిన కాల్బల సైనికులూ, వాళ్ళకు కొంచెం వెనకగా, యీటెలూ బల్లేలూ పట్టి సిద్ధంగా వున్న గుర్రపురౌతులూ సమాయత్తమయారు.

కాస్సేపటికల్లా భీమవర్మ, తన సైనికులతో ఎదురుముట్టడి ప్రారంభించాడు. కూడలిస్థానంమీద దేవపూర్ జమీందారు నాయకత్వంలో వున్న సైనికులూ, వీధికొసల వైపునుంచి భీమవర్మా, అతని అనుచరుల నాయకత్వంలో వున్న సైనికులూ బాణాల వర్షం కురిపించసాగారు.

అక్కడ ఎదురుదాడిని నడుపుతున్నది స్వయంగా భీమవర్మేనని విజయుడు గ్రహించాడు. కవచం ధరించి, కత్తి ఝుళిపిస్తూ భీమవర్మ తన సైనికులను ఉత్సాహపరుస్తున్నాడు. విజయవర్మ కంట పడగానే—

"రాంసింగ్! అడుగో మన బద్ధశత్రువు విజయవర్మ! వీణ్ణి యీసారి ప్రాణాలతో వదలకూడదు. ప్రాణాలతో పట్టి బంధించినా సరే, తల నరికి తెచ్చినా సరే; అంతా

నీయిష్టం. ఊఁ—ముందుకు..." అంటూ భీమవర్మ కేకలు పెట్టసాగాడు.

రామసింగ్ పేరు వినేసరికి విజయవర్మ నిశ్చేష్టుడయ్యాడు. తనూ రామసింగూ మునుపు ప్రాణస్నేహితులు. శబ్దవేధి ముసలి గంగులును బాణంతో హతమార్చినప్పుడు—దానికి కట్టివున్న లేఖలో, రాంసింగ్ సోం నగర్ తగలపెట్టినట్లు రాసివుంది. ఆనాటి నుంచీ క్రమక్రమంగా యిద్దరూ ప్రబల శత్రువులయ్యారు.

ఈనాటికి పగ తిర్చుకునే అవకాశం చిక్కిందిగదా అని విజయవర్మ ఎంతో సంతోషించాడు. యింతలో వీధి మొగను పేర్చిన ఆటంకాలను ఒకమూల ఛేదించి రాంసింగ్ లోపలకు జొరబడ్డాడు. రాంసింగ్‌తో బాహాబాహి యుద్ధానికై ఉవ్విళ్ళూరుతున్న విజయవర్మ ఒక్క దూకులో ముందుకు పోయి అతడితో కత్తియుద్ధానికి తలపడ్డాడు.

నాలుగైదు నిమిషాలపాటు పోరు జరిగే సరికి విజయలక్ష్మి ఎవరిని వరించబోతోందో అందరికీ తెలిసిపోయింది. అలసిపోయిన రాంసింగ్ ఒక్కొక్క అడుగే వెనక్కి వేస్తూ, తన సైనికసమూహంకేసి జరగసాగాడు. అపరిమితమైన వుత్సాహంతో పౌరుషంతో విజయవర్మ కవ్విస్తూ కత్తి తిప్పసాగాడు.




సరిగా వీధికి అడ్డంగా పరిచివున్న రక్షణలను సమీపించేసరికి, చెల్లాచెదరైవున్న మంచాలూ కుర్చీలూ అక్కడ పోరాడుతున్న యోధుల కాళ్లకు తగిలినై. వాళ్లు కాలు జారి అటూ యిటూ పడిపోసాగారు. అలాంటి స్థితిలో రాంసింగ్ కాలు జారడం, మరుక్షణాన విజయవర్మ కత్తివెళ్లి అతని తలను మొండెంనుంచి వేరుచేయడం ఒక్కసారిగా జరిగిపోయినై.

ఆ దృశ్యం చూసిన బీసల్పూరుసైనికులు జయజయధ్వానాలు చేశారు. భీమవర్మ సైనికులు భీతితో వెన్నిచ్చి పరిగెత్తసాగారు. భీమవర్మ చేసిన హెచ్చరికలుగానీ, ఇచ్చిన




అజ్ఞులుకానీ పిరికిగుండెతో పారిపోతున్న సైనికులను ఆపి, తిరుగా యుద్ధానికి తల పడేటట్టు చేయలేకపోయినై.

"నీ సాహసానికీ, చాకచక్యానికీ చాలా సంతోషించాను. భీమవర్మ సైనికులు వెన్నిచ్చి పారిపోతున్నారు. ఇదే అదనులో నర్మదా నదీతీరంలోని వాళ్ళ ముఖ్య భవనాన్నికూడా ముట్టడిస్తే మనం పూర్తిగా జయించగలమనుకుంటున్నాను. ఈ విషయంలో నీ అభిప్రాయం ఏమిటి?" అని అడిగాడు బీసల్వారు ప్రభువు.

విజయుడు మారు ఆలోచన లేకుండా ఈ ప్రయత్నానికి అంగీకరించాడు. నర్మదా



నదీతీర భవనంలోనే కరుణ బందీకృతురాలై వుంది. ఆమెను ఎంత త్వరగా తను విముక్తురాలిని చేయగలిగితే అంత క్షేమమని విజయవర్మ తలపోశాడు.

భవనంకోసం ఎంతో పోరు జరపవలసి వస్తుందని భావించిన విజయవర్మ నిరాశ చెందాడు. భవన ముఖ్యద్వారంవద్ద ఎదిరించిన కొద్దిపాటి సైనికులనూ, లోపల తలపడిన కొద్దిమందిని హతమార్చడం తృటిలో జరిగిపోయింది. భవనంలోని ఏ ప్రాంతంలో కరుణ బంధింపబడివున్నదో తెలియని విజయవర్మ ప్రతి గదితలుపునూ సైనికుల సాయంతో బద్దలుకొట్టించి వెతక సాగాడు. కాని ఎంత వెతికినా కరుణ కనబడనేలేదు.

నిరాశతో భవనం మెట్లు దిగి కిందికి వస్తున్న విజయవర్మకు హఠాత్తుగా ఒక ఆలోచన తట్టింది. అతడు సరాసరి భవనం చివరిమెట్లవరకూ ఎక్కి ఒక మూలని బురుజులా ఏర్పడివున్న ఒక చోటునుంచి అడవికేసి చూశాడు.

నలభై యాభైమంది గుర్రపురౌతులూ, కొంత కాల్బలమూ అడవికేసి హుటాహుటిని పారిపోతూవుండడం విజయవర్మ కంట బడింది. వారు తప్పక భీమవర్మవాళ్ళే



7



అయివుంటారనీ, కరుణనుకూడా బంధించి వెంట తీసుకుపోతున్నారనీ విజయవర్మ గ్రహించాడు. విజయవర్మ తన సైనికులను వెంటబెట్టుకుని, భీమవర్మను వెంబడించాడు. కొద్దిసేపట్లో అడవి సమీపించి, సైనికులకు హెచ్చరిక వేసి లోపలకుజొరబడ్డాడు. మరుక్షణాన్నే గొప్ప యుద్ధం జరుగుతున్న కోలాహలం అతనికి వినవచ్చింది.



ఆ కోలాహలం అడవిలోని దేవాలయ ప్రాంతంనించి వస్తున్నట్టు విజయవర్మ గుర్తుపట్టగలిగాడు. సైనికులను ఆ వైపు కదలండని ఆజ్ఞయిచ్చేటంతలో పడవల పానయ్యొ ఒక చెట్టుమీదినించి కిందికి దూకి-

"విజయా! ఇదే మనకు మంచిసమయం. భీమవర్మతో, చండీదాసు స్వయంగా పోరాటానికి తలపడ్డాడు. పద త్వరగా!" అంటూ కేకపెట్టాడు.

విజయవర్మ ఆ ప్రాంతానికి వెళ్ళేసరికి యుద్ధం దాదాపు ముగిసింది. చండీదాసు, పారిపోతున్న భీమవర్మ అనుచరులు కొద్దిమందిని వేటాడేందుకు తన అనుచరులను వుసికొలుపుతున్నాడు. చండీదాసును చూడగానే విజయవర్మ—

"కరుణ ఎక్కడ వుంది? భీమవర్మా, సోమశర్మలు పారిపోయారా?" అని ఆత్రంతో అడిగాడు. జవాబుగా చండీదాసు పెద్ద నవ్వు నవ్వి "కరుణ ఇక్కడే వుంది. భీమవర్మా, సోమశర్మలు వాళ్ళ పాపాలను తలుచుకొంటూ ప్రాణాలు వదిలారు. కత్తిపోటుకు చచ్చిన భీమవర్మా, బాణందెబ్బను ప్రాణాలు వదిలిన సోమశర్మా యిక్కడనే వున్నారు. కాని, సోంసగర్ తగలపెట్టిన రాంసింగ్ తప్పించుకున్నాడు!" అన్నాడు.

"రాంసింగ్ తప్పించుకుపోలేదు. యింతకుముందే నేను వానిని తుదముట్టించా" అన్నాడు విజయవర్మ.

ఈ జవాబుతో చండీదాసు పరమానంద భరితుడయ్యాడు.





25

"అయితే ఇక శత్రుశేషం లేదు. నీతండ్రి అభయవర్మను చిత్రవధచేసి చంపిన హంతకులకు తగిన శాస్తి జరిగింది. నా కోరిక నెరవేరింది. వున్నదల్లా ముందు కరుణతో నీ వివాహం. ఈ దేవాలయంలోనే అది జరిపేద్దాం" అన్నాడు చండీదాసు.

అక్కడే ఆ నిమిషాన కరుణతోటి విజయవర్మ వివాహం జరిగిపోయింది. ఆయుధాలు ధరించిన చండీదాసు అనుచరులే పెండ్లిపెద్దలూ, అతిథులున్నూ.

అందరి ముఖాలలో ఆనందం వెల్లివిరిసింది. చండీదాసు యిలా అన్నాడు :

"ఇక మనం సోంగనర్‌కు బయలుదేరుతున్నాం. ఆ ప్రాంతం అంతా నీ తండ్రిదే. భీమవర్మచే సర్వనాశం చేయబడిన ఆ భవనాలనూ వాటినీ తిరుగా నిర్మిద్దాం. ఇక మన జీవితాలు ప్రశాంతంగా గడుపుదాం". అంటూ చండీదాసు ప్రోత్సహించాడు.

మరి చంద్రదుర్గాధిపతిని కలుసుకోవడం ఎప్పుడు? ఆయన కరుణను పెంచిన తండ్రిగదా?" అన్నాడు ఆత్రంతో విజయవర్మ.

"చంద్రదుర్గాధిపతినీ కలుసుకుందాం. వివాహం సంగతి నేను ఆయనకు కబురు చేస్తాను. ముందు సోంనగర్‌కు బయలు దేరాలి" అన్నాడు చండీదాసు.

"అయితే నేనూ సోంనగర్‌కే; నా రహస్యగృహాన్ని ఇంతటితో వదిలేస్తున్నాను" అన్నాడు పడపల పానయ్య.

పానయ్య మాటలకు అందరూ నవ్వారు. విజయవర్మా కరుణలకు; అటూ యిటూ పానయ్యా చండీదాసులు నడవగా, విజయధ్వానాలు చేస్తున్న సైనికులూ అనుచరులూ వెంటరాగా, అందరూ సోంనగర్ కేసి బయలుదేరారు.

—[ 'శబ్దవేధి' ముగిసింది ]



# కుండలో దొంగలు

రంగన్న బలే తెలివైన కుర్రవాడు. తెలివి లోనూ అతితెలివి కలవాడు. పంతులును ఏడిపించటంలో, ధుండగాలు చేయడంలో రంగన్నను మించినవాడు లేడని పేరు పొందాడు. ఐతే, రంగన్నకు శరీరబలం ఉన్నంతగా బుద్ధిబలం వికసించలేదు.

ఒకరోజున రంగన్నతల్లి కలకండ తెచ్చి ఇంట్లో దాచింది. ఆ దాచటం రంగన్న కంట బడింది. దానిని ఎలాఐనా కాజేయాలని వాడికి బుద్ధిపుట్టింది. పుట్టడమేమిటి? ఆ క్షణంనుంచీ వాడికి ఏమీ తోచిందేకాదు.



రాత్రి పడింది. అందరూ పడుకొన్నారు. రంగన్నతల్లికికూడా నిద్రపట్టింది. నిద్రి స్తున్నట్టు నటించిన రంగన్న చూచాడు. లేచాడు. తల్లి దాచిన కలకండ చల్లగా తీసి జేబులో వేసుకొన్నాడు. చేస్తున్నది దొంగపని అని వాడి మనస్సుకు బాగా తెలుసు. మెల్లగా పెరటితలుపు తీసుకొని, వాళ్ల పొలంలోకి ఉడాయించాడు.

ఆ రోజున పొలంలో నూర్పుపనులు జరుగుతున్నాయి. ఎవళ్ళూ చూడలేదుకదా, రెండవ కంటివాడికి తెలియకుండా పటిక బెల్లం నోటిలో వేసుకోవచ్చుననే సంతోషంతో జేబులో చెయ్యిపెట్టాడు. అంతలో రంగన్న తండ్రి వచ్చాడు. రంగన్న బిత్తరపోయి, ఆ కలకండముక్క గభీమని అక్కడ దగ్గరగా వున్న నీళ్లకుండలో పడవేశాడు.

రాత్రంతా పొలంపని చూచుకొన్నాడు, రంగన్నతండ్రి. తెల్లవారవచ్చింది. పడు కొనివున్న కొడుకును లేపి ఇంటికి పోదాం అని పిలిచాడు. రంగన్న ఉలిక్కిపడి లేచి, నీళ్ళకుండలో వెతికాడు. కలకండముక్క కనిపించలేదు. వెతికి గాలించాడు.

కుండలోపల చూడగా తనవంటివాడే మరి ఒక కుర్రవాడు కనిపించాడు. తన కలకండ కాజేసింది వాడే అనుకొన్నాడు. తండ్రిని పిలిచి జరిగిన సంగతి అంతా చెప్పి, ఏడువ నారంభించాడు.

"ఉండు, వాడిపని చెబుతా!" అంటూ తండ్రి, రంగన్నను అవతలికి నెట్టి, కుండలో దొంగకుర్రవాడిని పట్టబోయాడు.

తీరాచూస్తే, దొంగకుర్రవాడు కనిపించ లేదు గాని, ఆ కుండలో సరీగా తనవంటి వాడే పెద్ద దొంగ ఒకడు కనపడ్డాడు!

"ఓరీ దుర్మార్గుడా!—ఎవడో కుర్ర వాడు తెలియక చేశాడనుకున్నాను. ఇంత పెద్దవాడవు. ఇన్నేళ్ళు నెత్తిమీదికవచ్చి, నీకే పుట్టిందా దుర్బుద్ధి? చిన్నబిడ్డల నోటిముం దటిది తీసుకొంటె పాపం చుట్టుకుంటుందనే భీతిఐనా లేకపాయెనే! ఇస్తావా, లేదా?" అని గద్దింపసాగాడు.

ఎంత తిట్టినా, ఏమిచేసినా, ప్రయోజనం లేకపోయింది. 'నీ పని ఇలా వుందా దొంగ గాడిదా!' అని ఉక్రోషంతో రంగన్నతండ్రి ఆ కుండను ఒక్కతాపు తన్నేసరికి, అది ముక్కముక్కలై వూరుకుంది!

తండ్రీకొడుకులు ఆ ఒలికిన నీళ్లలో కలకండముక్క కోసం తెగ వెతికారు. ఎక్కడవుంది? ఎప్పుడో కరిగిపోయింది!





# కుబేరుడి కొలను

పూర్వం దేవదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలిస్తూఉండే కాలమందు బోధిసత్వుడు ఆయనకు కుమారుడుగా పుట్టాడు. ఈ పుత్రునికి 'మహాశాసనుడు' అనే పేరుపెట్టి, అల్లారుముద్దుగా పెంచుకొంటున్నారు. మరి కొద్ది కాలానికే రాజుకు మరిఒక కొడుకు పుట్టాడు. ఈ శిశువుకు సోమదత్తుడని పేరు పెట్టి అపురూపంగా చూచుకొంటున్నారు.

ఈ బిడ్డలిద్దరూ పుట్టిన మరి రెండు సంవత్సరాలకు రాణి కాలగతి పొందింది. అందుచేత, దేవదత్తుడు మరిఒక రాజపుత్రికను వివాహం చేసికొన్నాడు. మక్కువ కొద్దీ కోరి పెళ్ళాడిన ఈ రెండవ భార్యకు కూడా ఒక కుమారుడు కలిగాడు.

చిన్నరాణికి పుత్రోదయమైన వార్త విని రాజు ఉబ్బిపోయాడు. సంతోషం పట్టలేక భార్యతో, పుత్రునికి సంబంధించిన వరం ఏదైనాసరే, కోరుకోమన్నాడు. అందుకు ఆమె 'ఇప్పుడేమీ అవసరంలేదు. పని పడినప్పుడు నా అంతట నేనే వచ్చి కోరుకుంటాను' అని బదులుచెప్పింది. 'సరే' నన్నాడు రాజు.

చిన్నరాణి కొడుకునకు 'ఆదిత్యు' డని నామకరణం చేశారు. ఆదిత్యుడు దినదిన ప్రవర్ధమానుడై, రాజులకు ఉచితములైన విద్యలన్నీ నేర్చి ప్రవీణుడై, క్రమంగా యౌవనవంతు డయ్యాడు.

అంతట చిన్నరాణి ఒకనాడు భర్తను సమీపించి, 'ఆనాడు మీరు నాకిచ్చిన వరం ఇప్పుడు ప్రసాదించవలిసింది. నా కుమారుడైన ఆదిత్యుని యువరాజుగా చేయటమే నా కోరిక' అన్నది.

ఈ మాటకు రాజు నిశ్చేష్టుడైనాడు. "ఏమిటీ కోరిక! పట్టపురాణికి పుట్టిన పెద్దవాళ్ళు ఇద్దరుండగా ఆదిత్యునికి యెలా వస్తుంది యువరాజుపదవి? తగవుమాలిన



ఇటువంటిపని చేయటానికి నేను సాహసించి నట్టయితే, లోకం నన్ను నిందించదా ? అప వాదు భరించగలమా ? నీ కోరిక సవ్య మైనది కాదు. అందుచేత కొనసాగదు" అని నిష్కర్షగా చెప్పాడు.

ఈ విధంగా రాజు తనను నిరాకరించి పలికినప్పటికీ చిన్నరాణి లెక్కచేయలేదు. తన ధోరణి మానలేదు. అప్పుడప్పుడు భర్తను ఇందువిషయమై పీడించి నిర్బం ధిస్తూనే వచ్చింది.

రాజుకు విసుగెత్తింది. 'చూడగా చిన్న రాణిది మంకుపట్టు. తనా, ఆమెకు ఎదురు చెప్పలేడు. తన కొడుకుమీది మక్కువచేత ఆమె పెద్దవాళ్లిద్దరకూ ఏవిధంగానైనా హాని చేయవచ్చు. ఇది లోక సహజం' అని మన సులో నిశ్చయించుకొన్నాడు. ఒకరోజున పెద్దవాళ్ళిద్దరనూ చేరబిలిచి, సంగతి సం దర్భాలన్నీ తెలియజెప్పాడు. చెప్పి, చివ రకు–"నాయనా!–మీకు కష్టాలు కలుగుత వని నాకు భయమగుతున్నది. ఇప్పుడే మీరు వనాంతరాలకు పోయి ఏదోలాగ కాల క్షేపం చేయండి. నా తదనంతరం రాజ్యం మీకే చెందుతుంది కనుక, అప్పుడు వచ్చి మీరు పాలించుకొందురుగాని" అని కుమారులిద్దరకూ హితవు చెప్పాడు.




తండ్రి ఆజ్ఞను తలదాల్చి, మహాశాస నుడూ, సోమదత్తుడూ వెంటనే బయలు దేరి వనాలలోకి తరలివెళ్ళారు. వీళ్ళిద్దరూ వెళ్ళడం ఎప్పుడు చూచాడో, ఆదిత్యుడు కూడా వెంటపడ్డాడు. దేశదేశాలన్నీ తిరిగి తిరిగి, సోదరులు ముగ్గురూ హిమాచల ప్రాంతాలదగ్గర అరణ్యాలు చేరుకొన్నారు.

మార్గాయాసమువల్ల కలిగిన బడలిక తీర్చుకోవటానికని వారు ముగ్గురూ ఒక చెట్టునీడని కూర్చున్నారు. తరువాత కొంచెం సేపటికి మహాశాసనుడు, కడసారివాడైన ఆదిత్యునితో "తమ్ముడూ!—అదిగో ఆ కొండ దిగువని చెట్టుకింద ఒక కొలను కని



పిస్తున్నది. పోయి, నీవు దప్పి తీర్చుకొని, తామరాకులు దొప్పలుగా కట్టి, వాటితో మాకుకూడా కాసిన్ని నీళ్ళు తెచ్చిపెట్టు" అని చెప్పి పంపాడు.

అన్న ఆజ్ఞచొప్పున ఆదిత్యుడు, పోయి మడుగులో దిగబోయాడు. కాని, ఒక పిశాచి వానిని పట్టి తీసుకపోయి, నీటి దిగువనున్న తన యింట చెరనుంచాడు.

ఎంతకూ ఆదిత్యుడు రాకపోవటంతో, చూచిరమ్మని మహాశాసనుడు సోమదత్తుని పంపించాడు. సోమదత్తునికూడా పట్టివేసింది భూతం. సోముడుకూడా రాకపోవటంచూచి, విచారించి, మహాశాసనుడు ఖడ్గహస్తుడై



స్వయంగానే మడుగుకు బయలుదేరాడు. ఎంతవెతికినా తమ్ములు కనపడలేదు. వాళ్లకేదో అపాయం మూడివుంటుందని తలచి, మహాశాసనుడు అలా గట్టుపైనే నించునివున్నాడు. తక్కిన ఇద్దరిలాగా ఇతడంత అనాలోచితంగా మడుగులోకి దిగడని భూతానికి తెలుసు.

ఇది పనికాదని, ఆ భూతం ఒక అడవి బోయని వేషంతో మహాశాసనుని ఎదట నిలబడి, "ఏమయ్యా స్వామీ!— అలసిపోయి నట్టున్నావే పాపం. ఈ కొలను నీళ్ళు చాలా మధురంగా ఉంటాయి. త్రాగి దప్పి తీర్చుకో!" అని హితవుచెప్పాడు.

ఈ మాట వినగానే, మహాశాసనుడు "అబ్బ!— వాలకం చూడగా, నా తమ్ములిద్దరనూ నీవె పట్టుకున్నట్టుగా తోస్తున్నది" అన్నాడు.

"ఔను, నేనే పట్టుకొన్నాను" అన్నాడు బోయవాడు ధైర్యంగా.

"ఎందుకని?" అని అడిగాడు, మహాశాసనుడు.

"ఈ మడుగునందు చొచ్చే ప్రాణులలో జ్ఞానసంపన్నులు తప్ప తక్కిన అందరూ నా అధీనమే. ఇది కుబేరమహరాజుగారి ఆజ్ఞ" అని చెప్పాడు బోయవాడు.



"అయితే, నిజంగా నీకు జ్ఞానసంపాదన యందు ఆసక్తి వున్నదా? అటువంటి కోరికే ఉన్నట్టయితే, నే నుపదేశిస్తాను" అన్నాడు మహాశాసనుడు.

"ఓ. సిద్ధంగా వున్నాను. ఉపదేశించు" అన్నాడు బోయవాడు.

అందుకు మహాశాసనుడు "నీవైతే సిద్ధంగా ఉన్నావుకాని, మార్గాయాసంచేత నాకు చాలా బడలికగా వున్నది. ఉపదేశం చేయటానికి తగినశక్తి లేకున్నది" అన్నాడు.

వెంటనే ఆ పిశాచి మహాశాసనుని తన ఇంటికి తీసుకుపోయి, శ్రమ తొలగేటట్టు చక్కగా స్నానపానాదులకు వసుపాయాలు అమర్చి, అతిథిని ఉచితాసనమందు కూర్చుండబెట్టి, తను ఆతని పాదాలవద్ద కూర్చున్నాడు.

"అబ్బాయీ!— నీవు కోరినట్టుగా జ్ఞానబోధ చేస్తాను. శ్రద్ధతో విను, మరి" అన్నాడు మహాశాసనుడు.

అప్పుడు బోయవాడు స్వస్వరూపం పొంది. "మహాత్మా!—నీవు సుజ్ఞానివి. నీ మాటలతో నేను తృప్తుడనయ్యాను. ఫలితంగా నీ తమ్ములలో ఒకరిని నీకు తిరిగి ఈయదలిచాను. ఇద్దరిలోనూ నీకు ఎవడు కావాలో కోరుకో" అన్నాడు.



అయితే, ఆదిత్యుని ఇమ్మని కోరుకొన్నాడు మహాశాసనుడు, ఎంతమాత్రం తడుముకోకుండా.

అందుకు పిశాచి, "అయ్యా, పెద్దవాడు ఉండగా చిన్నవానిని కోరుకోవటం ధర్మమా? వాని జ్యేష్ఠత్వం నిరాకరించవచ్చునా?" అని అడిగాడు.

ఈ ప్రశ్నకు మహాశాసనుడు :

"పిశాచోత్తమా! — నేను ఎన్నడూ కూడా ధర్మమార్గం తప్పి పలికేవాడిని కాను. నా తల్లికి నేను మిగిలివుండగా, నా పినతల్లికీ ఒక కుమారుడు ఉండవద్దా?— అది అటుండనీ. ఈ నా చిన్నితమ్ముని



కోసమే వాని తల్లి రాజ్యం కోరింది. మా తండ్రి ఇష్టంలేక మమ్మలిని అడవులకు పంపాడు. ఐతే, సోదరప్రేమచేత అమాయకుడైన ఈ కుర్రవాడు మా వెంబడి వచ్చేశాడు. మాతో కష్టాలు పడుతున్నాడు. వీనిని విడిచిపెట్టి, పెద్దవాళ్లమైన ఇద్దరం నగరం ప్రవేశించేటప్పుడు 'అదిత్యుడు ఏడి ?' అని లోకులు అడగరా ? 'వాడిని భూతం మింగివేసిం'దని అంటే, మా మాటలు ఎవళ్లయినా నమ్ముతారా ? లోకానికి విడ్డూరమనిపించదా ? లోకాపవాదం సహించగలమా ?" అని ఎదురుప్రశ్నలు వేయసాగాడు.

అప్పుడు పిశాచి, "మహాత్మా !—నీవు జ్ఞానసంపన్నుడవు మాత్రమే కావు. నీ మాటయందూ క్రియలలోనూకూడా ధర్మం కనబడుతున్నది" అంటూ మెచ్చుకుని, అతని తమ్ముల నిద్దరినీ తెచ్చి మహాశాసనుడికి వప్పచెప్పాడు. అంతేకాదు. ఆనాటినుంచీ, సోదరులు ముగ్గురూ ఆ భూతంతో మైత్రి కలిగి, అక్కడనే అతిథులుగా కాలక్షేపం చేయసాగారు.

మరికొంతకాలానికి దేవదత్తుడు కాలగతి పొందినట్టు వర్తమానం తెలిసింది. మహాశాసనుడు తమ్ములనూ భూతాన్నీ కూడా తనవెంట పిలుచుకపోయి కాశీరాజ్యం చేరుకొన్నాడు.

తరువాత, పెద్దవాడైన మహాశాసనుడు గద్దెయెక్కాడు. రెండవతమ్ముడైన సోమదత్తుని తన ప్రతినిధిగాను, కడసారివాడైన ఆదిత్యుని సేనాధిపతిగాను నియమించాడు.

తమకు మేలుచేసిన భూతాన్ని మహాశాసనుడు ఎంతమాత్రం మరువలేదు. దానికి చక్కటి విడిది చూపి, దాని అన్నపానాదులు విచారణచేయటానికి ప్రత్యేకించి భటులను యేర్పాటుచేశాడు.



# కథ విన్న ఫాదుషా



వినవయ్యో ఓ బాలవీరుడా! ఢిల్లీ
పట్నాన్ని పాలించు ఫాదుషా ఒకడు
అక్బరాతని పేరు, చక్రవర్తులలో
చక్రవర్తై చాల రాజ్యమేలాడు.

అతని కొలువులో హాస్యగా డొకడు
వీరబలు డనునట్టి పేరు గలవాడు,
వీరబలు డొకనాడు తీరుబడిగాను
కూర్చున్న అక్బరు కొలువులో కెళ్ళి
వంగివంగి సలాము లొనరించినాడు.

చేయెత్తి అక్బరూ స్వీకరించాడు
'తీరుబడిగా నున్నవార, మేదైనా
సంతోషపెట్టగల చక్కని కథను
చెప్పవయ్యా మాకు చెప్ప'మన్నాడు.

చెప్పమంటే కథ చెప్పితీరాలి
మానమంటే మధ్య మానితీరాలి
చెప్పలేననరాదు తప్పలాగంటే
తప్పదేదీ రాజు తలచుకుంటేను.

చెప్పలేకుండినా జ్వరముగా నున్నా
అందుకొని వీర్బలుడు అవజేసె కథను
పెద్దగా నిట్టూర్చి పెడముఖము పెట్టె
మొదటినుండీ తుదకు కథ విన్న రాజు

పెద్దగా నిట్టూర్చి పిచ్చిగా నవ్వి
'కథ చెప్పావెళ్లావు కాని అది ఒక్క
చెవిలోంచి దూరి వేరొక్క చెవిలోంచి
బయటకు పోయింది భాయి' అనె రాజు.

జ్వరముగా నుండినా చచ్చిపోతున్నా
కష్టపడి కథచెప్ప కథకు మెప్పేమీ
పొందలేకుంటినని పౌరుషం వచ్చి
వీరబలుడికి కొంత ఓర్మితప్పింది.

ఓర్మి తప్పిన నేమి ఉపయోగముంది
నోరుమూసుకు ఊరుకోవాలి కాని,
ఉన్నమాటాడినా ఊరుకుంటాడా?
ప్రాణాలు తీయడా పాపిష్ఠిరాజు?

కాబట్టి వీర్బలుడు బిగబట్టి కోపం
చేతులు నలుపుతూ చిరునవ్వునవ్వి
'రాజాధిరాజ ఓ ఫాదుషా! మనకి
సందేహమేల ఆ చెవులకి మధ్య
ఉండవలసిన దుండియుండ దన్నాడు.

ములుగు తిరువేంగళాచార్యులు



35

# పువ్వుల తోటలో కల్లోలం



లావణ్యపురంలో ఒక నందనవనం. వనానికి ప్రక్కన పుష్పవాటిక. పుష్పవాటికలో ఒక చక్కటి కొలను-వున్నాయి. ఆ ప్రదేశంలో ఎక్కడ చూచినా పువ్వులే. అంతా పువ్వుల మయం—రంగురంగులలో పువ్వులు, రకరకాల పువ్వులు, పరిమళాలను వెదజల్లి పరమానందం కలిగించే పువ్వులు, భూమి మీదా పువ్వులే, నీటిలోనూ పువ్వులే.

ఇంత జనాభా ఉండే పుష్పజాతికీ రాజున్నాడు. ఆ రాజు రోజూ దర్బారు చేస్తాడు. తీర్పులు చెబుతూవుంటాడు. పుష్పరాజ్యం చాలాకాలం రామరాజ్యం లాగా చల్లగా సాగిపోయింది.

ఐతే, ఉన్నట్టేవుండి ఒకరోజున, పువ్వుల తోటలో పెద్దపేచీ వచ్చింది. ఇది మంత్రి పదవిని గురించిన పేచీ. తుప్పలలో పడి వుండే మొగలిపువ్వు వయ్యారంగా లేచి నించుని, "నా పరిమళం యోజనాల దూరం వ్యాపిస్తుంది. నేను విరజిమ్మే పరిమళానికి ఎంతో దూరాన వుండే జనులు 'ఆహా-ఎక్కడినుంచి వస్తున్నది సువాసన!' అని దిగ్భ్రమ చెందుతారే. అందుచేత నేనే గొప్పదానిని" అన్నది.

ఈ మాటలకు రోషపడి, నీటిలోనించి కమలం జడ వూపుకొంటూ పైకి వచ్చింది. "నీ గొప్పతనం ఎవరికి తెలియదు, వంటి నిండా ముళ్ళూ నువ్వున్నూ. కంటికి ఇంపైతే కద, తరువాత సంగతి? మన జాతిలోకల్లా అత్యంత ఆకర్షణీయమైనటువంటి నన్ను పట్టడానికి అంతఃపుర స్త్రీలుసైతం ఆత్ర పడుతూవుంటారే. ఆ కథ ఎప్పుడూ విననే లేదా నువ్వు?" అన్నది.

ఇందుకు మొగలిపువ్వు మిడిమిడికి వచ్చి, "ఏమిటే, ఎర్రగా వుంటే సరా, చూపుల

మణిమెల వెంకటేశ్వర్లు

బొమ్మలాగా? 'ముళ్ళు-ముళ్ళు' అని చెప్పతున్నావే, గొబ్బికి లేవా, గులాబికి లేవా ముళ్ళు? వాళ్ళేం తక్కువవాళ్లా? ఆలోచించి మరీ మాటాడు" అని గద్దించింది.

ఈ గడబిడ విని, రాజ్యంలోని పుష్పజాతులన్నీ పరుగెత్తుకువచ్చినై. కొందరు ఆ పక్షం కాశారు, కొందరు ఈ పక్షం కాశారు. పెద్ద రగడ జరిగింది.

ఈ రగడ సరాసరి 'సుమదర్బారు' వరకు పోయింది. రాజుగారూ వచ్చారు. సుమదర్బారుకు ఇప్పుడు న్యాయాధిపతి ప్రొద్దుతిరుగుడుపువ్వు. ఈయన పగలల్లా సూర్యనమస్కారం చేసుకొని, రాత్రిపూటలందే కేసులు విచారణచేసి, తీర్పుచెప్పేది.

కమలం, మొగలిపువ్వుల కేసు మరునాటికి వాయిదా వేయబడింది. మరునాడు వాది ప్రతివాదులు ముందుగానే న్యాయస్థానం చేరుకొన్నారు.

చీకటిసమయం. వాది ప్రతివాదుల వకీళ్ళు సిద్ధంగా వున్నారు. న్యాయాధిపతీ రాజుగారూ, ఉచితమైన స్థానాలను అలంకరించారు. ముందుగా కమలంవేపు తిరిగి దానిని సంజాయిషీ చెప్పమన్నారు.

కమలంతరఫు వకీలు లేచి, "ప్రభూ!- మా కమలంగారి ప్రతిభ ఎంతసేపూ




సూర్యుడు ఉండేటంతసేపే. రాత్రి పడితే వారికి మాటకూడా రాదు" అన్నాడు.

చిక్కె వచ్చింది. పగటిపూట న్యాయాధిపతి తీర్పుచెప్పలేడు. రాత్రిపూట ముద్దాయీ మాటాడలేడు. ఇంక ఈ తగవు పరిష్కారమెట్లా? మళ్ళీ మరునాటికి వాయిదావేశారు.

ఈ సందర్భంలో మొగలికి ఒక మంచి ఉపాయం తట్టింది-వెలుగునిచ్చే ఒక చిత్రమైన ఆకు వద్దకు వెళ్ళవామని. సూర్యుడు లేకపోయినా, తన పచ్చటికాంతితో ఆ ఆకు లోకాన్ని ప్రకాశింపచేయగలదు. ఈ వుద్దేశంతో మొగలిపువ్వు వెలుగునిచ్చే ఆకు వద్దకు వెళ్లి మాటాడింది.

మరునాడు పుష్పరాజ్యమంతా దర్బార్ వద్దనే విడిసింది. రాజూ, న్యాయాధిపతీ వారి స్థానాలు అలంకరించారు. ఆనాడు ప్రొద్దుపోయినా చీకటి పడలేదు. ఎక్కడ చూచినా చేమంతులు, గాజుబుడ్లవంటి తమ కాంతితో వింతగా ప్రకాశిస్తున్నయి. ప్రొద్దు తిరగకూండానే ప్రొద్దుతిరుగుడుపువ్వు దర్బారుకు రాగా, అందరూ విస్తుపోయారు.

వాది ప్రతివాదుల తరఫు వకీళ్లు గట్టిగా వాదించారు. వాదనలన్నీ ఐనతరువాత న్యాధిపతి ఇలా తీర్పు చెప్పాడు: "ఈ కేసులో వచ్చిన ఇద్దరూ గొప్పవాళ్ళే. ప్రముఖులే. పరిమళానికి మొగిలి, అందానికి కమలం—రెండూ లోకానికి అవసరమే. ఇందులో వాదనకు ఎటువంటి అవకాశమూ లేనందున కేసు కొట్టివేయడమైనది."

అప్పుడు రాజుగారు చిరునవ్వుతో సింహాసనంమీదినించి లేచారు:

"గౌరవనీయులైన మన న్యాయాధిపతి గారు చెప్పిన తీర్పు ఎంతో యుక్తియుక్తంగా వుంది. మనలో మనం, ఐక్యత లేక చిలిపి కయ్యాలు ఆడుకోవటంచేతనే మానవులు మనలను హింసించటం జరుగుతున్నది. ఆడవాళ్ల అందంకోసం మనలను మెడలు తుంపి వారు ధరించడమట! గొప్పవాళ్లను సన్మానించడంకోసం మనజాతిని లెక్క లేకుండా నాశనంచేసి, వారు దండలు గుచ్చి వేసికోవడమట! ఏమిటీ అన్యాయం! మన స్థితి భద్రంగా వుండాలంటే, మన శ్రేయస్సు కోరే మంచి మంత్రివర్గం అవసరమై వుంది. కనుక ఇప్పుడు, ఒకొక్క గుణానికి గొప్ప పేరుపొందిన మొగిలి, కమలాలను ఇద్దరనూ మన ఆస్థానంలో మంత్రులుగా నియమిస్తున్నాము"

ఇందుకు సమ్మతిస్తూ, పుష్పజాతులన్నీ జేజేలు కొట్టినై.






ఆరావళీ కొండలలో చిదానందుడనే ఒక యోగి ఉండేవాడు. ఒకనాడు అయన తన పర్ణశాలలో జపం చేసుకొంటూవుంటే పన్నెండేళ్ల బాలు డొకడు ప్రాణభీతితో పరుగెత్తి వచ్చి పాదాలపైబడి, శరణుచొచ్చాడు.

యోగి ఆ బాలుణ్ణి లేవనెత్తి, 'ఎవరు నువ్వు ? యేమిటి ఆపద ?' అని అడిగాడు.

'నేను జసల్మీరు సంస్థానాధీశ్వరుడైన బీజీరావువారి కుమారుణ్ణి. నా పేరు దేవరాజు. శత్రువులు మా కోట వశంచేసుకుని మా తండ్రిని చంపేశారు. నన్ను చంపటానికి తరుముకొస్తున్నారు' అని చెప్పాడు.

యోగి వెంటనే ఒక అంగవస్త్రం తెచ్చి ఆ బాలుని కిచ్చి, 'నీ షరాయి, అంగీ విప్పివేసి దీన్ని కట్టుకో' అని చెప్పి, ఆ రాజపుత్రుని గుడ్డలు కనపడకుండా చూరులో దోపివేశాడు. తన జందెపుపోచలలో ఒకటి తీసి, పిల్లవాడి మెడలో వేసి, "'నీ పేరు ఎవరు?' అని ఎవరైనా అడిగితే 'సోంభొట్లు' అని చెప్పు" అని సలహాయిచ్చాడు.

అంతలో గుఱ్ఱపుడెక్కల చప్పుడు వినిపించింది. "అదుగో, వాళ్ళే వస్తున్నారు !" అన్నాడు దేవరాజు.

'భయపడకు. నాకొక విస్తరివేసి నువ్వొక విస్తరి వేసుకో. అన్నం తిందాం' అన్నాడు యోగి.

వాళ్ళిద్దరూ వడ్డించుకుని ముద్ద నోట్లో పెట్టుకునేసరికి గుఱ్ఱాలమీద వచ్చినవాళ్ళు దిగి, ఓరగా వున్న తలుపు తోసుకుని లోపలకు వచ్చారు. 'ఎవరు వారు ?' అన్నాడు యోగి ఏమీ ఎరగనట్లు.

అయన భోజనం చేస్తున్నాడని తెలవటంతో వాళ్ళు నాలిక కరుచుకుని, 'క్షమించండి. రాజపుత్రుడెవరైనా ఈదారిని వచ్చాడేమో అని వచ్చాము' అన్నారు. అందుకు యోగి, 'నేను వంట చేస్తూ ఇక్కడే



పున్నానే. 'ఏమిరా సోంబోట్లూ, చితుకుల కోసం వెళ్ళినప్పుడు నీ కెవరైనా ఎదురు పడ్డారా?' అన్నాడు. దేవరాజు, 'నా కెవరూ కనపడలేదు గురువరా... కొంచెం పులగం వడ్డించమన్నారా ?' అని బదులుచెప్పాడు, ఏమీ సంకోచంలేకుండా.

గుఱ్ఱాలపై వచ్చినవాళ్ళు దేవరాజును చూచి బ్రాహ్మణుని శిష్యుడనుకొని, అనుమానించకుండా వాళ్లదారిని వాళ్లు వెళ్ళిపోయారు. దేవరాజు యోగి పాదాలపైన పడి, 'స్వామీ, నా ప్రాణాలు కాపాడి, పుణ్యం కట్టుకొన్నారు. మీ ఋణం ఎలా తీర్చుకోగలను ?' అన్నాడు.



'ఋణం లేదు గిణం లేదు, నీకిక్కడ ఎంతకాలం ఉండాలని తోస్తే అంతకాలం ఉండి, ఆ తరువాత వెళ్లి ఎక్కడైనా రాజ్యం స్థాపించుకో' అన్నాడు చిదానందయోగి.

కత్తి పట్టి వీరవిహారం చేసే చేతికి అడవిలో చితుకులు ఏరుతూ కూచుంటే ఎంత కాలం తోస్తుంది? ఒకనాడు దేవరాజు యోగి ముందు నిలిచి, 'స్వామీ, నన్ను ఆశీర్వదించి పంపండి. మళ్ళీ రాజ్యం సంపాదించుకుంటాను' అన్నాడు.

'తథాస్తు!' అని చిదానందయోగి లేచి, ఏదో ఆకు దూసితెచ్చి, దాని పసరును ఒక వెదురుగొట్టంలో పోసి దేవరాజుకిచ్చాడు.

'ఏమిటిస్వామీ ఇది?' అన్నాడుదేవరాజు.

'ఇనుమును బంగారంగా మార్చేది. రాజ్యం స్థాపించాలంటే ధనం అవసరం కదా. అందుకోసమే' అన్నాడు యోగి.

దేవరాజు దాన్ని భద్రపరుచుకుని, 'మీ జ్ఞాపకార్థం ఆ అంగవస్త్రంకూడా పట్టుకు వెడతాను' అని చెప్పి, ఆనాడు యోగి తనకు కట్టుకోమని ఇచ్చిన గావంచాను కూడా చంకనబెట్టుకు వెళ్ళాడు.

ఆ వెళ్ళడం వెళ్లడం తిన్నగా మేనమామ ఐన భూతరాజు యింటికి వెళ్ళాడు. దేవరాజుకుమల్లేనే అతని తల్లికూడా శత్రు








వుల బారినుండి తప్పించుకొనివచ్చి అన్నగారింట్లో తల దాచుకుంది. ఆమె తన కుమారుడు బ్రతికేవున్నాడని తెలవడంతోనే వచ్చి, ఉప్పుతెచ్చి దిగదుడిచి, దాన్ని నీట్లో పోసి, 'నాయనా నీ శత్రువులంతా ఈ వుప్పుమల్లేనే కరిగిపోయి రూపులేకుండా మాసిపోవాలి!' అని చెప్పి కౌగలించుకుంది.

'అమ్మా, మంత్రాలకు చింతకాయలు రాలవు. శత్రువులను నాశనంచెయ్యాలంటే తక్షణం నేనొక కోట కట్టాలి. బలగాన్ని పెంచాలి. అప్పుడు దండెత్తివెళ్లి శత్రువుల్ని తరిమివేసి మన జనల్మియురు కోట వశం చేసుకోవాలి. కోట కట్టడానికి మామయ్యని కాస్త స్థలం ఇమ్మను' అన్నాడు దేవరాజు.

ఆమె అన్నను అడిగింది. అందుకు భూతరాజు 'స్థలం లేదు, గిలం లేదు. పో, పొమ్మ'న్నాడు. ఆ సమయానికి అక్కడికి గౌడారివాడొకడు ఎద్దుచర్మం తెచ్చి భూతరాజుకు కానుకగా ఇచ్చాడు. ఆ కానుక చూచి దేవరాజు, 'మామా, యెంతో స్థలం వద్దు. ఈ ఎద్దుచర్మం పట్టేటంత మేర చాలు' అన్నాడు. అంతేకదా అని భూతరాజు వప్పుకుని, ఒక ఇసుకపఱ్ఱ చూపించి, 'అక్కడ తీసుకో' అన్నాడు. 'ఎద్దుచర్మమంత మేర స్థలంతో ఏమిటి చేసుకోవడం?' అనుకుంది దేవరాజు తల్లి. దేవరాజు ఆ ఎద్దుచర్మాన్ని సన్నటి పీలికలుగా కోసి, ఒకదాని కొకటి ముడిపెట్టి, ఆ త్రాడుతో కొన్నియెకరాల విస్తీర్ణాన్ని ఆక్రమించి, 'చూడు మరి, ఇదే ఎద్దుచర్మం పట్టినంత మేర!' అన్నాడు.

భూతరాజు వచ్చిచూసుకొని గుండె బాదుకున్నాడు. 'ఇసుకయెడారేకదా భాగ్యమేమిటయ్యా మామా?' అన్నాడు దేవరాజు. నిజమే అనుకుని భూతరాజు వెళ్లిపోయాడు. దేవరాజు మరునాడే ఉప్పర్లను రప్పించి అంతమేరా కోటగోడకు పునాదులు తవ్వించాడు. సాయంత్రం



కావటంతోనే వాళ్ళందరూ కూలి ఇమ్మనే సరికి, అతడు వాళ్ళ గునపాలలో ఒకటి చేత పుచ్చుకుని చిదానందయోగి ఇచ్చిన పసరు రాసేసరికి అది బంగారంగా మారిపోయింది. దానిని విక్రయించి వాళ్లందరికీ కూలి ఇచ్చాడు.

కొద్దిరోజులలోనే అక్కడ గొప్ప కోట ఒకటి లేచింది. దానిముందు భూతరాజు కోట దివిటీముందు దీపానికిమల్లె వెలవెలపోయింది. దానితో భూతరాజుకి మేనల్లుడంటే అసూయ పుట్టుకొచ్చింది. వెంటనే తన సైన్యాన్ని వెంటబెట్టుకువెళ్లి మేనల్లుని కోట ముందు నిలిచి, 'నా భూమిమీద కట్టావుగనక ఈ కోట నాది! మంచిగా దీన్ని నాకు వశంచేస్తావా?, లేకపోతే బలిమిని లాక్కునేవా?' అని కేకలు వేశాడు.

దేవరాజు పంపగా తల్లి వచ్చి భూతరాజుతో, 'ఇదేమిటన్నయ్యా, నీకూ మేనల్లుడికీ యుద్ధమేమిటీ? అంత నీకు కోటమీద మోజుగావుంటే నువ్వే తీసుకో. ముందు నువ్వు, కాళ్ళుకడుక్కో; నీ సైనికులను కూడా లెమ్మను, కాస్త ఫలహారం చేదురుగాని' అంది.

ఏ పేచీ లేకుండా కోట తనకు చిక్కుతూ వున్నందుకు భూతరాజు సంతోషించాడు. మేనమామ సైనికులందరికీ దేవరాజు విస్తళ్ళు వేయించి పిండివంటలతో సహా ఫలహారాలు వడ్డన చేయించాడు. వాళ్ళు కడుపునిండా తినిలేచి చేతులు కడుక్కుని వచ్చేసరికి పీటలపైన ఒక్కొక్క పంచెల చాపు పెట్టించాడు. ఒక్కొక్కడూ పంచె కట్టుకుని కండువా పైన వేసుకోబోయేసరికి కొంగున ఏదో బరువుగా కనపడింది. ఒక్కొక్కడూ విప్పి చూచుకొనేసరికి వంద వంద చొప్పున వరహాలున్నాయి. 'ఇవెందుకు' అన్నారు వాళ్లు ఆశ్చర్యపోతూ.

అందుకు దేవరాజు, 'మీకే. వచ్చేనెల జీతం ముందుగా ఇచ్చేస్తున్నాను' అన్నాడు.

'మా జీతం మీ రివ్వడమేమిటి? అదీ గాక, మాకు పదేసి వరహాలేకదా జీతం. వందేసి వరహాలిచ్చారే మీరు!' అన్నారు సైనికులు.

'ఫరవాలేదు పుచ్చుకోండి. మనమంతా కొద్దిరోజుల్లో వెళ్లి జసల్మీయరు కోట ముట్టడించి వశంచేసుకోవాలి' అన్నాడు దేవరాజు. 'సరే' అన్నారు వాళ్లు సంతోషంగా.

ఈవిధంగా లంచమిచ్చి దేవరాజు సైనికులను వశంచేసుకున్నాడని తెలపటంతోనే భూతరాజు మండిపడి వాళ్లతో 'మనం వశంచేసుకోడానికి వచ్చింది ఈ కోటనేగాని జసల్మీయరు కోటను కాదు. వాడిచ్చిన లంచాలకి ఆశపడి నాకు ద్రోహంచేస్తున్నారా మీరు!' అని గద్దించాడు.

'ద్రోహం తలపెట్టింది మీరుకాని మేం కానేకాదు. ఈయన కష్టపడి కట్టుకున్న ఈ కోటను లాగుకోవడంకన్న ద్రోహమేముంది?' అని ఎదురుతిరిగారు సైనికులు. చేసేదిలేక భూతరాజు గుఱ్ఱమెక్కి ఇంటికి దౌడుతీశాడు. ఆ సైన్యంతోబాటు దేవరాజు ఇంకా కొంత సైన్యాన్ని చేర్చుకున్నాడు. కొద్దికాలంలోనే జసల్మీయరు కోటను ముట్టడించి, దానిలో వున్న శత్రువుల్ని పారదోలి వశం చేసుకున్నాడు.

నాడు ముస్తాబై కొలువుకూటానికి వచ్చినప్పుడు దేవరాజు భుజంమీద ఒక అంగవస్త్రం వేలాడుతూ కనపడింది. మంత్రులూ, సేనాధిపతులూ, 'ఇదేమిటి ప్రభూ?' అని అడిగేరు. 'ఈ అంగవస్త్రమే నా ప్రాణాలను కాపాడింది' అంటూ అతడు తన కోటు విప్పి లోపలవున్న జంధ్యంకూడా చూపించి, చిదానందయోగి తనకు చేసిన ఉపకారమంతా వాళ్లకు విప్పి చెప్పేడు.

నాటినుంచీ దేవరాజు సంతతివారందరూ పట్టాభిషేక సమయంలో అంగవస్త్రమొకటి భుజంపై ధరించి రావటం, ఒక ఆచారంగా ఏర్పడింది.








# లీలా-లాలీ

మాంత్రికు డొక్కడు ప్రాణము పోయగ
యంత్రపు బొమ్మను చేశాడూ
డాబాపై కుర్చీలో దానిని
డాబుగ కూర్చొబెట్టాడు.

చేతనున్న ఆ పత్రిక చూస్తూ
శిరఃకంపనము చేస్తుందీ
బాలబాలికలు దండం పెడితే
'బలే సలాములు కొడుతుంది.

ఒకేమోస్తరుగ తల పంకించుట
ఒక్కరొక్కరే చూశారూ



మనిషో బొమ్మో నిజమెరుంగగా
మంతనములు గావించారు.

లీలా, లాలీలను యువనాయకు
లే పరీక్షకై పూనారు.

ఆటవిడుపు దినమున జనులందరు
ఆటపాటలం దుండంగా
మాంత్రికు డింటికి తాళమువేసీ
మధ్యాహ్నము పై కేగాడూ
జనసమ్మర్దములో తబ్బిబ్బై
తన తాళము జార్చివేశాడు.

తాళము లీలకు దొరికింది
తలుపు తెరుచుకొని చొరుకుంది,
బొమ్మల నెన్నో చూచింది
సంగతి అంత గ్రహించింది.

అంతలొ సవ్వడి వినబడగా
మాంత్రికుడే రయమున రాగా

వసంతరావు వేంకట్రావు

ఎటు పోవను తోచకపోగా
మాయము కాదలచెను వేగా.

వరుసబొమ్మలం దొక బొమ్మయి, యే
మెరుగనట్లుగా కూర్చుందీ,
తెరచిన యింట్లో జొచ్చిన మాంత్రికు
డిరుప్రక్కల గమనించాడూ.

స్థానం తప్పని బొమ్మల జూచి మ
హానందమును పొందాడూ
ప్రాణం పోయగ నెంచిన బొమ్మను
పరిపరి విధాల పరికించీ
చుట్టు తిరుగుతూ గబగబ దానికి
గట్టిగ మంత్రం వేశాడు.

నిలిచి చూడగా, మెల్లమెల్లగా
తల త్రిప్పుట గమనించాడూ
మంత్రం పలుకుట నిజమని తనలో
ఎంతో సంతోషించాడు.

జాలుగోడపై నెక్కి మెల్లగా
లాలీ లోన ప్రవేశించీ
లీలకు అగుపడునట్లుగ పక్కని
చావడిలో నిలుచున్నాడు.

మంత్రం జోరవుతున్నకొలది ఆ
యంత్రం కదలుట హెచ్చిందీ

అది గమనించిన మాంత్రికు డెంతో
ముదమున మది నుప్పొంగాడు.

చిరునవ్వొలకగ, తల పంకించుతు,
కరముల నెత్తుతు, కండ్లు త్రిప్పుతూ,
నెమ్మదిగా ఇక లేవనున్న ఆ
బొమ్మకు ప్రాణం వచ్చిందనుకొనే,
మంత్రమహిమ కాశ్చర్యచకితుడై
మాంత్రికు డట్లే నిలబడగా,

అచ్చముగా నొక కన్యకవలె నా
యంత్రం 'లాలీ!' అన్నాదీ.
అనుటె తడవుగా బాణంవలె రి
వ్వున లాలి చరచర వచ్చి,

బొమ్మ చేతులను చేతపట్టుకొని
గుమ్మాల్ దాటుతు పోవంగా
మాంత్రికుడు మతిపోవగ చింతా
క్రాంతుండై పడి భువి వ్రాలె!



# నలుమూలల నడకలు

ఒక ముష్టివాడొక యింటికి వెళ్ళాడు. ఆ ఇంటాయన పరమలోభి. ముష్టివాడు కొన్ని తత్వాలు పాడాడు. 'నాకూ వచ్చు' నంటూ ఇంటాయనా పాడాడు. బిచ్చగాడు శ్లోకాలు చదివాడు. యజమానీ చదివాడు. ముష్టివాడు కొన్ని ఇంద్రజాలాలు చేసిచూపాడు. యజమానీ చేసిచూపాడు. బిచ్చగాడికి విసుగెత్తింది. 'అయ్యా, మీరు సమస్తమైన విద్యలూ నేర్చినవారు. సంతోషమే. ఐతే, మీరు చేయలేనిది ఒక్కటే వుంది. నేను అడుక్కొంటాను. మీరో?' అన్నాడు. యజమాని సిగ్గుపడి, వాడికి ఒక కానీ యిచ్చి సాగనంపాడు.

—*—

అతి గౌరవనీయమైన వృత్తికి ప్రపంచ విజ్ఞానసమితివారు ఒక బహుమతి ఇస్తామని ప్రకటించారు. ప్రభువులు, వీరులు, పండితులూ పోటీకి నిలిచారు. సమితి పండితులనే గౌరవించింది. ఇది 'అన్యాయ' మన్నారు ప్రభువులు. 'కాదు, రాజులకు తమ రాజ్యంలోనే గౌరవం. పండితులు ఎక్కడకు వెళ్ళినా పూజింపబడతారు' అని చెప్పింది సమితి. 'మరి, వీరపూజ మట్టుకు సామాన్యమైనదా ?' అని ప్రశ్నించారు యుద్ధవీరులు. అందుకు సమితి 'వీరుడు వృద్ధుడైతే గౌరవం తగ్గిపోవచ్చు. పండితుడు వృద్ధుడైన కొద్దీ ఆయనకు గౌరవం హెచ్చుతుంది' అని సమాధానం చెప్పింది.

—*—

ఒక పేదవాడు తన బుద్ధిబలంవల్ల పైకి వచ్చి ఐ. సి. యస్. పరీక్ష ప్యాస య్యాడు. తన బంధువర్గం గొప్ప పదవుల్లలో లేకపోవడంచేత వాళ్లంటే అతనికి చీకాకుగా వుండేది. అతని ధోరణి చూచి బంధువులు స్నేహితులూ వానిని వెలివేశారు. బ్రతుకు ఒంటి పాటు అయింది. భరించలేక, ఒక నాడు అతను ఒక మిత్రునివద్దకు వెళ్ళగా, ఆయన ఇలా చెప్పాడు: 'అబ్బాయీ!–బ్రహ్మాండమైన ఏనుగును బంధించటానికి గడ్డితో వెంటి చుట్టు తారు. ధాన్యం మొలక ఎత్తాలంటే దానికి అంటిపెట్టుకొనివుండే తుక్కూ దూగరాకూడా అవసరమే కదా! కనుక దేనినీ తేలికగా చూడకూడదుసుమా' అని అనగానే, ఈ మాటలలోని అర్థం గ్రహించి, నాటినుంచీ బంధువులతో కలసిమెలసి ఉంటూవచ్చాడు.




పూర్వం సంగ్రామసింహుడనే రాజు ఉండేవాడు. అయన రాజ్యంమీద వచ్చిన ఆదాయంలో కొంచెంమాత్రమే తనకోసం ఖర్చుపెట్టుకుని, మిగిలినదంతా ప్రజల కోసమే వినియోగించేవాడు.

కొన్ని గ్రామాలనుండి వచ్చే శిస్తును మాత్రమే తన స్వంతఖర్చుకోసం కేటాయించి, ఒక్కొక్క గ్రామంనుంచి వచ్చిన ఆదాయాన్ని ఆయన ఒక్కొక్క బాపతు ఖర్చుకు ఉపయోగించేవాడు. అంటే, ఒక ఊరినుండి వచ్చిన శిస్తు భోజనంనిమిత్తం, మరొక గ్రామంనుండి వచ్చిన పన్ను బట్టల కోసం, వేరొక పల్లెపై వచ్చిన ఆదాయం రాణులకోసం ఈవిధంగా. ఒక్కొక్క సంవత్సరం పంటలు పండకపోతే ఆదాయం తగ్గిపోయేవి. రాబడి తగ్గినప్పుడు ఖర్చు తగ్గించుకునేవాడుకాని ఆ ఖర్చు నిమిత్తం ప్రజలకోసం వినియోగించే సొమ్ముమాత్రం ముట్టుకునేవాడుకాడు.

ఒకనాడు ఆయన కొలువు తీర్చివుండగా భట్రాజు ఒకడువచ్చి తన కవిత్వంతో రాజును మెప్పించాడు. రాజు సొంత ఖర్చుకోసం కేటాయించుకున్న గ్రామాలపేర్లు చెప్పి, వాటిల్లో ఎక్కడైనా మాన్యం కోరుకోమన్నాడు. రాజుగారి భోజనపు ఖర్చుక్రింద యేర్పడిన గ్రామంలో ఒక మాన్యం కోరుకున్నాడు ఆ భట్టు. వెంటనే భట్టుకు రాజు దానపట్టా వ్రాయించి ఇచ్చాడు.

రాజుగారికి భోజనంలో, పెరుగులో చక్కెర కలుపుకొని తినటం అలవాటు. ఆ మరుసటిసంవత్సరం ఉగాదినాడు రాజుగారికి వంటవాడు చక్కెర కలపకుండానే పెరుగు వడ్డించాడు. 'చక్కెర మరిచిపోయావోయ్!' అన్నాడు రాజు. వంటవాడు

పాలంకి వెంకటరామచంద్రమూర్తి




వినయంగా, 'ప్రభూ! మరిచిపోలేదు. తమ భోజనంకోసం యేర్పడిన గ్రామాలలో పంచదారకోసం నియమింపబడ్డ మాన్యాన్ని తాము ఎవరికో దానమిచ్చివేశారట. అందుచేత ఇంక తమకు చక్కెర లేదని మంత్రిగారు మనవిచేయమన్నారు' అన్నాడు.

అందుకు రాజు, 'ఔను. ఆ మాన్యమే కామోసు భట్టుకవికి ఇచ్చాము. ఇక్కడనుండి చక్కెర మానివేస్తాము' అని అప్పటినుంచీ పంచదార అలవాటు తప్పించుకున్నాడు.

దుస్తుల విషయంలోనూ రాజు మితంగానే వ్యయంచేసి దానికోసం నియమించ



బడ్డ గ్రామంమీది శిస్తుతోనే సరిపెట్టుకునేవాడు. సామంతరాజులలో జస్వంతసింగనే అతడికీ సంగ్రామసింహుడికీ చనవు. జస్వంతసింగుకు, చూడగా రాజుగారు ధరించే దుస్తులు పొట్టిగా బిగువుగా పాత ఫక్కీలో వున్నట్లు తోచింది.

అతనికి మహారాజుతో చనవుగనుక సమయం చూసి ఒకనాడు తన అభిప్రాయాన్ని ఆయనకు తెలియజేశాడు. 'తమరు ఈ కొత్తమోస్తరు ముఖమల్ దుస్తులు ధరిస్తే మేముకూడా తమ పద్ధతినే అనుసరించవచ్చుకదా' అన్నాడు.

జస్వంతుడు చెప్పినదంతా శ్రద్ధగా విని, సంగ్రామసింహుడు 'సరే. అట్లాగే చేస్తాను' అనిచెప్పి ఆ సామంతుణ్ణి సంతోషపరిచాడు. జస్వంతసింగు తక్కిన సామంతులతో జరిగినదంతా చెప్పేసరికి వాళ్లు ఢిల్లీపాదుషాలకుమల్లే తాముకూడా ఇంక రంగురంగుల జిలుగుదుస్తులు ధరించి కులకవచ్చునని సంతోషించారు.

మరునాటి వుదయం జస్వంతసింగు రాజధానిలో అందంగా దుస్తులు తయారు చెయ్యగల దర్జీ ఎవడా అని ఆలోచించుకొంటూవుంటే అతనివద్దకు సంగ్రామసింహుడి దూత ఒకడు వచ్చి, 'అయ్యా మీ








గ్రామాలలో రెండింటిని మహారాజావారు కలుపుకొన్నారు' అని చెప్పి చక్కా పోయాడు.

జస్వంతుని గుండె గుభేలుమని, 'నా గ్రామాలు కలుపుకొనటానికి నేను చేసిన నేరమేమిటీ?' అని ఆలోచించటం మొదలెట్టాడు. ఎంత యోచించినా అతనికి కారణం కనపడలేదు. మహారాజు ఏపని చేసినా తగినంత కారణం లేందే చేయడని అతనికి తెలుసు. అదేమిటో స్వయంగానే తెలుసుకోవడం మంచిదని అతడు వెళ్ళి సంగ్రామసింహునకు నమస్కరించి, 'ప్రభూ!—మీకిలా అనుగ్రహం తప్పటానికి నేను చేసిన తప్పు ఏమిటో సెలవిస్తారా?' అని కోరాడు.

సంగ్రాముడు, 'నువ్వు చేసిన తప్పేమీ లేదు. నీ గ్రామాలు కలుపుకోటానికి గల కారణం చెపుతా విను: నిన్నరాత్రి నా లెక్కలు పరీక్షించి చూసుకున్నాను. నా గ్రామాలమీది శిస్తులో ప్రతీ రూపాయకూ అత్యావసరమైన ఖర్చు ఏదో కనపడుతూనే వచ్చింది. నువ్వు చెప్పిన ముఖమల్ దుస్తులు కుట్టించటానికి నాకు నిలవ సొమ్మెక్కడా కనపడలేదు. ఈ దుస్తుల కోసం ప్రజల సొమ్ము వినియోగించడం నా కిష్టంలేదు. పోనీ దుస్తులు మానేద్దామంటే పరమాప్తుడవైన నువ్విచ్చిన సలహా తోసి పుచ్చినట్టవుతుంది. నువు చిన్నబుచ్చుకుంటావు! అందువల్ల ఈ కొత్తదుస్తులకయే ఖర్చుకోసం నీ గ్రామాలలో రెండింటిని నేను కలుపుకోవలసి వచ్చింది' అన్నాడు.

జస్వంతునికి కొఱవితో తల గోకుకొన్నట్టయింది. 'ప్రభూ! ఇప్పుడు మనం ధరించే దుస్తులే బాగున్నాయి. కనుక వీటిని మార్చనే వద్దు! నా గ్రామాలు నాకు దయచేయించండి' అని ప్రాధేయపడ్డాడు. 'సరే అట్లైతే' అని మహారాజు అతణ్ణి అనుగ్రహించి పంపాడు.




49

# మోటార్ కారుల తమాషా





పాపాయిలూ!—ఈ చిత్రంలో రెండు మోటారు కార్లున్నయి. అవునా?—అవి ఒకదానికి ఒకటి ఎదురెదురుగా వస్తున్నయి. ఐతే—రెండూ కొంపతీసి ఢీకొట్టుకుంటయ్యేమోనని కదా మీ భయం. భయపడవద్దు. నేను చెప్పినట్టుగా చేస్తేసరి. చూడండి!—రెండు కారుల వైపూ పెళ్లగా నిదానంగా చూస్తూ, మీ దృష్టిని ముక్కుకు సూటిగా తీసుకురావాలి. అంతే. ఏదీ చూదాం!—ఇప్పుడు—కార్లు రెండూ దేనికది జాగ్రత్తగా తప్పుకొని పోతున్నయా, లేదా?

—ఎస్. ఎస్. వెంకటసుబ్బయ్య : తిరుపతి

---



ఇది ఒక అడవిపంది. దీనికి రెండు పొడవైన దంతాలు ఉంటవి. అవి వంపుతిరిగి తలవైపు పెరుగుతవి. దుంపలనూ, తుంగకాయలనూ తవ్వి తింటుంది కనక దంతాలు అరిగిపోతూ ఉంటై. ఒకవేళ అవి అలా అరగకుంటే పెరిగి పుర్రెలోపలికి చొచ్చుకుపోయి దాని మరణానికి కూడా కారణం కావచ్చు.





ఇది నీలి తిమింగిలం. ప్రపంచంలో తిమింగిలాలలో కల్లా బ్రహ్మాండమైన ఆకృతి కలది. పొడవు 100 అడుగులు! ఇది చేపజాతికి చెందినదనుకొంటారు చాలామంది. పొరపాటు. ఇది స్తన్యజీవి – అనగా పాలిచ్చి పెంచే జంతువు. దీని ఉనికి ఉత్తర అట్లాంటిక్ సముద్రం.




చిన్నప్పరెడ్డి, రామప్పరెడ్డి అన్నాదమ్ములు. వ్యవసాయదారులు. వాళ్ళకు చాలా కాలం బాగానే గడిచిపోయింది. ఐతే, ఒకయేడు పంటలు పోయినై. ఫలితంగా దేశంలో గొప్ప కాటకం పట్టి, ప్రజ కటకటలాడిపోసాగారు.

పెద్దపెద్ద ధనవంతులకే దిక్కు లేక పోయిందంటే, ఇక చిన్న సంసారులైన చిన్నప్పసోదరుల మాట చెప్పేదేమిటి? చివరకు వాళ్ళు అటుకుగింజలు తిని కాలక్షేపం చేయవలసిన స్థితికి వచ్చారు.

ఇలా వుండగా—ఒకరోజున ముసాబు పట్టింది. వాళ్ళు అటుకులు తెచ్చుకుని ఆరగిస్తూవున్న సమయాన, ఎదటియింటి అరుగుమీద ఒక రామచిలుక కనిపించింది. అది వానకు తడిసి చలితో వణకిపోతున్నది. ఎక్కడకూ ఎగిరిపోయే స్థితిలో లేదు.

చిన్నవాడైన రామప్ప గమనించాడు. జాలిపడ్డాడు. అన్న అనుజ్ఞ తీసుకొని ఆ చిలుకను చేతపట్టుకవచ్చాడు. ఎండిన ఆకులు తెచ్చి మంటవేసి, దాని శరీర మంతా వెచ్చజేశాడు. దానికి చలిబాధ కాస్త తగ్గటం చూచి, తనవంతు అటుకు గింజలలో కొన్ని చిలుకముందర చల్లాడు. రామప్పచేసిన సేవవల్ల రామచిలుకకు చలి పోవటమే కాదు, ఆకలికూడా తీరి, వంట్లో జవసత్తువలు చేరుకొన్నవి.

తేరుకొని స్తిమితపడిన తరువాత ఆ రామచిలుక 'రామప్పా!—నీకేమి కావాలె రామప్పా!' అంటూ మానవభాషలో అడిగింది. రామప్ప ఆశ్చర్యపోయాడు. ఈ వింతచూచి బయట కూర్చున్న చిన్నప్ప లోపలికి వచ్చాడు. వెంటనే రామచిలుక "చిన్నప్పా, చిన్నప్పా!—నీ కేమి కావాలె చిన్నప్పా?" అని అడిగింది. అందుకు చిన్నప్ప "చిలుకా, చిలుకా!—నీది ఏవూరు? నీకు మనుషుల భాష ఎవరు

హెచ్. ఎమ్. సత్యనారాయణశెట్టి





నేర్చారు ?" అని ఆత్రంతో ప్రశ్నించాడు. బదులుగా రామచిలుక "నేను మా పెద్ద చిలుకలగుంపుతో కలసి ద్వీపాంతరం పోతున్నాను. వానచేత రెక్కలు తడిసి, ఎగరలేక ఈ ఇల్లు చేరుకొన్నాను. నా జత గాళ్ళు ముందు పోతున్నారు. నేనూ పోయి వారిని వెంబడించాలె. మీ కేంకావాలో చెప్పండి!" అన్నది.

అప్పుడు చిన్నప్ప "ఐతే, చిలుకా! మేం బీదస్థితిలో పడిపోయాము. మా పేదరికం పోగొట్టగలవా?" అని అడిగాడు.

అందుకు రామచిలుక "దానికేముంది! నేను ద్వీపాంతరంనుంచి మళ్ళీ ఆరునెలలో వస్తాను. అప్పుడు నీ కొక వెండి ఆకు తెచ్చిపెడతాను. అది భద్రంగా ఉంచు కొంటివా, నీ యింట ఎప్పుడూ ధనం ఓల లాడుతుంది" అని చెప్పింది. 'సరే' నన్నాడు చిన్నప్ప.

తరువాత రామచిలుక 'రామప్పా, రామప్పా! నీ కేమికావాలె రామప్పా?' అని చిన్నవానిని అడిగింది. అందుకు రామప్ప "చిలుకా, చిలుకా!—నాకు ఎల్లప్పుడూ మనస్సు సుఖంగా వుండేటట్టు చేయగలవా?" అని అడిగాడు.

అందుకు చిలుక 'దానికేముంది! నేను ద్వీపాంతరంనుండి ఒక రంగుఆకు తెచ్చి యిస్తాను. దాని పసరు నీ రుమాలుమీద చల్లి తలపైన పెట్టుకుంటివంటే, అది అలా ఉన్నంతసేపూ నీకు మనస్సు హాయిగా వుంటుంది, నీ ముఖం చిరునవ్వుతో కలకల లాడుతుంది" అని చెప్పింది.

చిలుక ద్వీపాంతరం వెళ్ళింది. ఆరు నెలలు గడిచినై. మళ్ళీ వచ్చింది రామ చిలుక. దాని నోటిలో రెండు ఆకు లున్నయి—ఒకటి వెండిఆకు, రెండవది రంగుఆకు.

చిలుక తెచ్చిన రెండు ఆకులలో వెండి ఆకు చిన్నప్పకూ, రంగుఆకు రామప్పకూ






ఇచ్చి, 'మరి వెళ్ళుతా'నంది. 'ఉండు, ఉండు రామచిలుకా!— మా యింట భోజనంచేసి మరీ పోదుగాని' అన్నారు అన్నదమ్ములు. అందుకు చిలుక, 'ఇప్పుడు కాదు. మరొకప్పుడు వస్తాలెండి. మా జట్టు ముందు పోతున్నది. నేనూ పోవాలె' అని తొందరపడింది. అప్పుడు రామప్ప 'పోనీ ఇవైనా తీసుకు తిను' అంటూ, తనవద్దనున్న అటుకుగింజలు కొన్ని చిలుకకు ఇచ్చాడు. రామచిలుక ఎగిరిపోయింది.

చిన్నపరెడ్డి తన ఆకు పట్టుకువెళ్ళి ఊళ్ళో కంసాలికి చూపించాడు. అతడు ఆ ఆకు పరీక్షచేసి, 'ఇది వెండిఆకు. నీ కెట్లా దొరికింది?' అని అడిగాడు. ద్వీపాంతరంనుండి చిలుక తెచ్చిన వృత్తాంతమంతా చిన్నపరెడ్డి పూసగుచ్చినట్టు చెప్పాడు. ఈ వర్తమానం ఆ నోటా ఆ నోటా పాకిపోయి, గ్రామాధికారి ఐన హనుమంత రెడ్డి చెవులబడింది. ఆయన చిన్నప్పను పిలిపించి, అరా తీశాడు.

హనుమంతరెడ్డికి సంగతి అంతా వెల్లడించాడు చిన్నప్ప. అంతటితో ఊరుకోకుండా "మా తమ్ముడు రామప్ప వట్టి మూర్ఖుడు. చిలుక కోరుకొమ్మన్నప్పుడు ఉత్త రంగుఆకు మాత్రమే కావాలన్నాడు" అనికూడా చెప్పాడు. గ్రామాధికారి రామప్పను పిలిపించి, అతనివద్ద ఉన్న రంగుఆకు చూచాడు. రామప్పముఖంమీద చిరునవ్వు కనిపిస్తూవుంది. సరేననుకొన్నారు నలుగురూ.

అప్పుడు హనుమంతరెడ్డి ధనవంతుడైన చిన్నప్పను చేరబిలిచి, లాలించి, "నా ఒక్కగానొక్క కూతురునిచ్చి నీకు వైభవంగా పెళ్ళిచేస్తాను నాయనా!—నా తరువాత నా ఆస్తిఅంతా నీవే తీసుకొందువుగాని. మూర్ఖుడైన నీ తమ్ముడితో మాత్రం ప్రమేయం పెట్టుకోకుసుమా" అని చిన్నప్పకు హితవుచెప్పాడు.





పూర్వులు వదలిన పూరిగుడిసెలోనే వాని ఉనికి. చేతిలో ఎర్రని యేగానీ ఐనా లేకపాయె. ఇక వ్యవసాయం చేసేదేమిటి? రోజల్లా కాయకష్టంచేసి గింజలు సంపాదించుకోవడం, తీరికప్పుడు పచ్చగడ్డి చెక్కుకొనీ, కట్టెలు కొట్టితెచ్చీ, విక్రయించి జీవనం సాగిస్తున్నాడు. అతనికి చింతలేమీ లేవు. సుఖంగా ఉండేవాడు. చిరునవ్వు ఎప్పుడూ ముఖంమీద కనిపిస్తూవుండేది.

ఐతే—రామప్పముఖంమీద కనిపించే చిరునవ్వు సామాన్యమైందికాదు. అది మహిమగలది. రామప్ప ఎక్కడ వుంటే అక్కడ, అతని నోటివెంట మాటవస్తే చాలు, అందరకూ మనస్సు హాయిగా వుండేది. అతను ఉన్నదగ్గర రోగులకు వ్యాధులు నయమయేవి. ప్రజ కష్టాలు మరచేవారు. ఈ రహస్యం కనిపెట్టిన లోకులు రామప్పను తమ యిళ్లకు తీసుకపోయి 'మాట్లాడు రామప్పా!' అని బతిమలాడి పలుకరించి, మేలుపొందుతూ ఉండేవాళ్ళు.

ఇలా వుండగా—పట్టపురాజుగారి పుట్టిన రోజు పండగ వచ్చింది. ఆ రోజున తమ కింది గ్రామాధికారులంతా రావాలని ఉత్తరువయింది. ఇప్పుడు చిన్నప్ప తనే గ్రామాధికారి అయాడుకద.

చిన్నప్పకు చెప్పలేని సంతోషం పుట్టుకవచ్చింది. గ్రామాధికారికి అల్లుడైనాడు. తాతలనాటి పూరిల్లు తమ్ముడికి ఇచ్చేసి, తను మామగారి భవనంలోనే నివాసం ఏర్పరచుకొన్నాడు. మామగారు ముసిలివాడవుతున్నకొద్దీ పొలాలు చూచుకునే పని అంతా చిన్నప్ప పాలబడింది. ఐతే, చిన్నప్ప వ్యవసాయంలో అరితేరినవాడు కనుక, పాడీ పంటా వృద్ధిచేశాడు. ఇల్లు ధనలక్ష్మితోనూ, ధాన్యలక్ష్మితోనూ కలకలలాడసాగింది.

ఐశ్వర్యంతోపాటు చిన్నప్పరెడ్డికి గ్రామంలో గౌరవమూ ఎక్కువయింది. అక్కడ రామప్పసంగతి చూదాం :



చిన్నపరెడ్డి గొప్పగా అలంకరించు కొన్నాడు. అతని భార్య ఏడువారాల నగలూ సింగారించుకొన్నది.

ఈ విధంగా తయారైన చిన్నపరెడ్డీ భార్యా సవారిబండీ యెక్కి కూర్చున్నారు, వాళ్ల బండీ ఒక అడవిలోనించి వెళ్లు తున్నది. దారిలో దొంగలగుంపు నాయకుడు ఒక ముసలివాని వేషంతో అక్కడికి వచ్చి, జ్యోతిషుడులాగా నటించాడు. వాడు అడిగే ప్రశ్నలకూ, చెప్పే జవాబులకూ చిన్నప రెడ్డి ఆశ్చర్యభరితుడయ్యాడు.

'స్వామి!—మీవద్ద నస్యముంటే వేయిం చండి' అంటూ చెయ్యి చాచాడు వాడు. గొప్పకొద్దీ చిన్నప్ప వెండికట్లు వేసిన నస్యం డబ్బా తీసి వృద్ధుడి చేతిలో వేశాడు. వృద్ధుడు చిన్నప్పను దీవిస్తూ, ఒక చిటికెడు పొడి పీల్చి, రెండు తుమ్ములు తుమ్మాడు. అప్పుడు వెనుక దాగివున్న నలుగురు దొంగలూ ముందుకు వచ్చారు. చిన్నప్పకూ భార్యకూ భయంవేసింది. ముసిలివాడు ఏమీ తెలి యనివాడిలాగా దిక్కులు చూస్తూవున్నాడు.

అంతలో నలుమూలలనుంచీ దొంగలు బిలబిలమంటూవచ్చి చుట్టేసి, 'నగానట్రా, లొడ్డూలొసుగూ వప్పజెపుతారా? లేదా?' అంటూ తళతళమెరిసే కత్తులు ఝళి




పించారు. చేసేదిలేక చిన్నప్ప తమ వద్ద నున్నదంతా దొంగల పాలు చేసి, కట్టు బట్టలతో ఒక పల్లె చేరుకొని, పేదరాశి పెద్దమ్మ యింటిలో దిగాడు.

ఇలా వుండగా, ఆ దేశపు రాజుకు ఒక్కర్తే కూతురు. తగిన అల్లుడికోసం చారులను అన్నిదిక్కులకూ పంపించాడు రాజు. కాని లాభం లేకపోయింది. అందు చేత, రాజూ రాణీ విచారగ్రస్తులై వున్నారు.

ఈ సమయంలో, ఫలానా రామప్ప ఎవళ్ల కైనా విచారం పోగొట్టగలడని రాణీగారితో ఎవరో చెప్పారు. వెంటనే అతనిని పిలి పించమని రాజాజ్ఞ అయింది.




రాజాజ్ఞ మీరలేక రామప్ప, నడుముకు ఒక తెల్లటివస్త్రం కట్టి, పైన ఒక తుండు గుడ్డ వేసుకొని, తలకు రంగుఅకు రుమాలు చుట్టుకొని, శాపాటికర్ర చేతితో పట్టుకొని, రాజమహలుకు చేరుకొన్నాడు.

చేరుకొనేసరికి, రాజనగరులో దర్బారు అతివైభవంగా నడుస్తున్నది. రామప్పవెళ్లి రాజదర్శనం చేసుకొన్నాడు. రామప్ప నవ్వుముఖం చూడగా రాజుకు సంతోషం పుట్టింది. 'సరే, రేపు మాటాడుదాం' అన్నాడు రాజు. రామప్పకు ఒక గది ప్రత్యేకించి ఏర్పాటుచేశారు. మర్గాయాసంచేత రామప్పకు నిద్రపట్టేసింది. రాజు కోరిక మీద మరొక వారంరోజులువరకూ రామప్ప అక్కడే ఉండిపోవలసి వచ్చింది.

అంతలో రాజకుమారికి తగిన వరుడు లభించినట్టు వార్తవచ్చింది. అప్పుడు రాజు గారు 'రామప్పా!—మా అమ్మాయి పెళ్ళి చూచి మరీ వెళుదువుగాని ఉండిపో' అన్నారు. 'సరే' నన్నాడు రామప్ప.

రామప్ప ఒకనాడుస్నానంచేస్తూవుండగా, సేవకుడు ఒకడు 'ఈ పాడురుమాలు కట్టుకుని వెళితే అంతఃపురంలో అందరికీ అవమానంకాదా?' అని తలచి, రామప్పకు తెలియకుండానే గట్టుమీది ఆ రంగుఅకు రుమాలు తీసి దాచివేశాడు.

స్నానం అయాక రామప్ప 'నా రుమాలు ఏదీ!' అని వాడిని అడిగాడు. అందుకు నౌకరు 'రాజుగారి దయ నీపైనుంటే ఆ పాడు రుమా లెందుకయ్యా? అది యేటిలో కొట్టుకపోయింది. మహరాజుగారి నడిగి మంచి రుమాలే, తెచ్చుకో?' అన్నాడు. రామప్ప విచారంతో నగరుకు వెళ్ళాడు.

ఈ సమయాన నగరులో గందరగోళ మయింది—పెళ్ళివారు తరలివస్తూంటే పెళ్లికొడుక్కి పులివచ్చి గాయం చేసిందనీ, పరివారం చెదరిపోయారననీ. తన రుమాలు లేకపోవటంవల్ల రాజుకే ముప్పు

పచ్చిందని గ్రహించి, రామప్ప విచారంతో మళ్ళీ ఏటిగట్టుకు పోయి నిస్పృహ తో అక్కడ పడిపోయాడు.

అలా పడిపోయివున్న రామప్పముఖం మీద ఒక స్త్రీ నీళ్ళు చల్లి, ఒక పాత రుమా లుతో తుడిచి, ఉపచారాలు చేయసాగింది. 'పాతదైతే అయింది, ఈ రుమాలు తలకు చుట్టుకో, వేడి తగుతుంది' అన్నది ఆమె. రామప్ప కొంచెం తేరుకోగానే, ఆమె తన వదినెగారనీ, ఆమెపక్కన వున్నతడు తన అన్న చిన్నప్పరెడ్డి అని గుర్తించాడు. ఐతే, సిగ్గుచేత చిన్నప్ప తమ్ముని పలక రించలేదు.




రామప్ప ఆమెను కుశలప్రశ్నలు వేయగా, దారిలో దొంగలవల్ల తమకు పట్టిన గతిఅంతా వలపోసుకున్నది. మాటల సందర్భంలో తనకు రేవుగట్టున ఈ రుమాలు దొరికిన సంగతికూడా చెప్పింది. రుమాలు తలకు చుట్టుకోవటంతో రామప్ప ముఖం మళ్లీ ఇప్పుడు వికసించింది. అది తన రంగులకు రుమాలేనని రామప్ప తెలుసుకున్నాడు.

అతని అన్నా వదినా సకలమూ పోగొట్టు కొన్నారు. ఆకలిదప్పలతో కన్నులు మూతపడుతున్నవి. అప్పుడు వారిద్దరికీ రామప్ప మంచినీళ్ళు తెచ్చియిచ్చాడు. వారికి తినటానికి ఏదైనా తీసుకువద్దామని నగరంకేసి బయలుదేరాడు.

అంతలో ఒక చారుడు పరుగెత్తివచ్చి 'బాబూ!—రాజావారు రమ్మంటున్నారు తమరిని' అంటూ వేగిరపెట్టాడు. తీరా రామప్ప అక్కడికి వెళ్ళేసరికి—పులి కరి చింది పెళ్లికొడుకును కాదనీ, ఒక సేవకుణ్ణి అనీ తెలిసింది. అంతా సవ్యంగానే వుంది- పెళ్ళివారి పల్లకి వస్తున్నట్టు కబురు తెలి సింది. అందరూ సంతోషించారు. రామప్పను చూడగానే రాజుగారు "ఇంత సేపూ ఎక్కడవున్నావు రామప్పా!' అన్నారు.



57

'ఏటికి స్నానానికి వెళ్ళాను ప్రభూ!' అన్నాడు రామప్ప, చిరునవ్వు నవ్వుతూ.

'అక్కడ నా అన్నా, వదినే చిక్కులో వున్నారు' అనికూడా చెప్పాడు. వెంటనే రాజుగారు పల్లకీ పంపించి, చిన్నప్పనూ భార్యనూ రప్పించారు.

రాజుగారి కుమార్తెకు వైభవంగా పెళ్ళి జరిగింది. రామప్పకూ, చిన్నప్పకూ ప్రభువు వారు విలువైన బహుమతులిచ్చారు. తరువాత అన్నాదమ్ములిద్దరూ వాళ్ల ఊరికి ప్రయాణమయ్యారు. రామప్ప తనవంతు బహుమతులన్నీ అన్నకే ఇచ్చి, 'అన్నయ్యా! నాకు పెళ్లామా, పిల్లలా! ఇవేం చేసుకొంటాను' అనిచెప్పి, సోదరుడికే యిచ్చి వేశాడు. మళ్ళీ రామప్ప తన తాతల నాటి పూరిగుడిసె చేరుకొని, సుఖంగా వుంటున్నాడు. ఇలా వుంటూవుండగా మరి కొద్దిరోజులకల్లా ఆనాటి రామచిలుక మళ్ళీ ఇక్కడికి వచ్చింది. 'రామప్పా, రామప్పా!—మాట్లాడు రామప్పా!—రంగుఆకు మంచిదా? వెండిఆకు మంచిదా?' అని అడిగింది.

అందుకు రామప్ప 'తోటకు రంగుఆకు మంచి, ఇంటికి పిల్లలూ పాపలూ మంచి, చింత లేని ఇల్లు అన్నిటికీ మంచి...' అని బదులుచెప్పాడు. చిలుక సంతోషంతో అతనిని దీవించి తన దారిని అది వెళ్లిపోయింది.

ఆ తరువాత చిన్నప్పకు జ్ఞానంవచ్చింది. తన అత్యాశ తనకే పాఠం చెప్పిందని గ్రహించాడు. తమ్ముణ్ణి తిన్నగా చూడక నిరసించినందుకు ఎంతో నొచ్చుకున్నాడు. చిలుక చెప్పిన మాటలలో అంతరార్థం గుర్తించి, వెంటనే తమ్ముణ్ణి చేరదీసుకుని ఆదరించాడు. అంతటినుండీ అన్నాదమ్ములిద్దరిలో భేదభావాలూ, ఎక్కువ తక్కువలూ కనిపించలేదు లోకానికి.



# రంగుల బొమ్మ కథ - 5

గంగన్న మూడవసారి మళ్ళీ బయలుదేరి, మారువేషంతో రాక్షసుని కోటకు పోయాడు. అక్కడ వుండే అప్సరసను మంచిచేసుకొని, లోన ప్రవేశించాడు.

యథాప్రకారం జ్వాలాముఖుడు వచ్చి 'నరవాసన! నరవాసన!!' అంటూ హుంకరించాడు. భార్య మందలించగా, భోజనం చేసుకొని, మాయవీణచేత గానం చేయించాడు. అది చేసే అద్భుతగానానికి రాక్షసుడికి నిద్రపట్టేసింది.

గంగన్న ఒడుపుచూచి, ఈసారి ఆ వీణ తీసి చంకను పెట్టాడు. ఐతే, అది మహిమగల వీణ. పాడటమే కాదు, మాటాడుతుందికూడా. గంగన్న ఎత్తుకు పోతూవుంటే అది అరవటం ప్రారంభించింది. ఆ సందడికి రాక్షసుడు మేలుకొని, ఉగ్రుడై, గంగన్నను వెంబడించాడు. యుక్తిపరుడైన గంగన్న ఏమీ భయపడలేదు. పాదు వద్దకు చేరుకోగానే తను కిందికి దిగి. వెంటనే కత్తితో పాదు పరపరకోసివేశాడు.

ఉరకలువేసుకొంటూ వస్తూన్న రాక్షసుడు ఈ పాదు దిగే రావాలి. అలాగే చేశాడు వాడు. కాని, పాదు తెగిపోయిఉండటంవల్ల జారి, జ్వాలాముఖుడు పర్వతంలా కిందపడి, భూమిలోపల మణిగిపోయాడు.

రాక్షసుడు ఇలా హఠాత్తుగా పరుగెత్తుకు రావటంతో, కంగారుపడి కోటలో అందరూ వానివెంట పరుగెత్తుకు వచ్చారు. కాని, కిందికి దిగలేకపోయారు.

జ్వాలాముఖుడి పీడ వదలగానే, గంగన్న తల్లి పసివాడిని దీవించి, ఇప్పుడు వెల్లడించింది, ఇంతవరకు చెప్పని అసలు రహస్యం—ఈ దుర్మార్గుడే తమ పూర్వుల ఐశ్వర్యమంతా కొల్లగొట్టి, వారిని బికారీలుగాచేశాడు అని. తను చేసినపనికి ఎంతో గర్వించాడు గంగన్న. కోటకు మార్గం ఏర్పరిచాడు.

తరువాత గంగన్న మళ్లీ కోటకుపోయి అప్సరసను పలకరించాడు. ఆమె వానిని అనేక విధాల మెచ్చుకొంటూ, తను ఒక రాజకుమారిననీ, ఈ రాక్షసుడు బంధించాడనీ చెప్పింది. ఆమె పేరు సౌగంధి. ఆమె కోరి గంగన్నను పెళ్లాడింది. గంగన్న కోట వశపరుచుకున్నాడు. తరువాత రాక్షసుడి భార్య లొంగిపోయి, గంగన్నకు సేవకురాలైంది.

బంగారు కోడి, ధనం సంచులు, మాయవీణ—వీటితో గంగన్నా, సౌగంధీ, గంగన్న తల్లీ, ఎప్పటి వైభవం అనుభవిస్తూ సుఖంగా వుంటున్నారు.

*

# ముచ్చటైన మూడు టైపు చిత్రాలు



పి. పెద్దిరాజు - చిట్టివలస



డి. ఎల్. వెంకటపతి - బెంగళూరు



ఎ. నరసింహరావు - సికింద్రాబాద్

# ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1954 ఫిబ్రవరినెల సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.

★ డిసెంబర్ 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ ఒకపోస్టుకార్డుపైనవ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## జనవరినెల చందమామలో

ప్రచురింపబడే ఫోటోలకుగాను, ఈ దిగువ ఉత్తమవ్యాఖ్యలకు బహుమతి యివ్వడమైనది

మొదటి ఫోటో : ఆటలో మాట | రెండవ ఫోటో : పాటులో మూట

పంపినవారు : కుమారి సి. పద్మావతి - కర్నూలు

బహుమతిపొందిన ఈ వ్యాఖ్యలు, పంపినవారి పేరుతోసహా జనవరినెలలో ప్రచురిస్తాము. బహుమతిమొత్తం రూ. 10/- జనవరిసంచిక వెలువడినవెంటనే పంపబడుతుంది.

Photo by R. M. Agashe



బహుమతి
పొందిన వ్యాఖ్య

తోడుదొంగలు

పంపినవారు:
ఆర్. ఎస్. జాన్ - విజయనగరం

